


రంగువి, తెల్లనివి
త్రికోణములు ఒక దాని తరువాత ఒకటి
వేసి డిజైనుచేయబడిన వాయిల్స్ వీటితో
వస్త్రధారణలోని మీ అభిరుచికి సెభాష్
అనిపించుకొంటారు. ఈ వాయిల్స్ మీ
అందమునకు మెరుగులు దిద్దుతాయి. టాటా
టెక్స్‌టైల్స్ వారి వాయిల్స్ అన్నిటినీ ఉతికి
ఇస్త్రీ చేసినా పరవాలేదు. అవి ఎల్లప్పుడూ,
తళతళ లాడుతూ క్రొత్త వాటివలె కనిపిస్తాయి.

ULKA-TT-112 TEL

**TATA** *Textiles* టాటా టెక్స్‌టైల్స్‌వారి వాయిల్స్

# ఉత్తరాలు

పాఠకులకీ, రచయిత (త్రు)లకి వినాయక చవితి సందర్భంగా మా శుభాకాంక్షలు.

ఇది వినాయకచవితి ప్రత్యేక సంచిక. ఈ సంచికలో కొంత 'స్థలం' కొరత ఏర్పడింది. అందుచేత ఎక్కువ ఉత్తరాలు వెయ్యలేక పోతున్నాము! తెలంగాణా సమస్య మీద ప్రచురణకి స్వీకరించిన ఉత్తరాలని వయివారంనుంచి వెయ్యటం ప్రారంభిస్తాము. ఇంతకిముందే మేము ప్రకటించినట్లు 'తెలంగాణా సమస్య' మీద మా కార్యాలయం చేరిన ఉత్తరాల సంఖ్య కొన్ని వందలు! వీలయినంత వరకూ చిన్న ఉత్తరాలనే ప్రచురణకి ఎన్నుకోవలసివస్తున్నది! కొందరు పాఠకులు తమ ఉత్తరాలని గురించి రాస్తున్నారు. ఈ విషయమయి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపటం సాధ్యంకాదని గమనించ ప్రార్థన! — సం॥

## సీరియల్

మన వారపత్రికలో ప్రచురించిన వెలుగు నీడలు సీరియల్ నవల చాల భావగర్భితముగా నడచి సుఖాంతముగా ముగింపబడి నాకు ఆనందము చేకూర్చినది.

కారుమూరి యస్. శివాజి, (రాజమండ్రి)

* * *

వెలుగు నీడలు సీరియల్ ముగింపు చాలా బాగుంది. —వి. సంజీవ్ కుమార్. (తుమ్మపూడి)

## ధర్మపథం

భగవంతుడు తన భక్తులు చికాకుపడి పట్టుదల వహించినప్పుడు వారి కోరికలు నెరవేర్చి తీరుతాడు. అన్న బులుసువారి మాటలు నాకెంతో నచ్చినవి.

ఉపాధ్యాయుల అన్నపూర్ణ (జయపురం)

## కథలు

రావులపాటి సీతారాంరావు గారి 'అద్దెకిచ్చిన హృదయం' చాలా బాగుంది. ముఖ్యంగా గభే పాత్ర నాకు బాగానచ్చింది. నవ్విస్తూ నవ్విస్తూనే చివరకు విషాదములో ముంచివేశారు రచయిత. ఇకనుండి దయచేసి ఇటువంటి కథలే ప్రచురించండి. రచయితకు నా ధన్యవాదాలు.

సి. జయంత్ (మల్యాల).

* * *

స్వాతంత్ర్య దినోత్సవ సంచికలో ప్రచురించిన బావా—మరదలు కథ సుమారు ఐదుసార్లు చదివానంటే శ్రీమతి రాధారాఘవ్‌గారి రచనా శైలి వర్ణనాతీతం! కాని ప్రభాకరం తన భార్యను అపార్థం చేసుకున్నంత మాత్రాన ప్రభాకరాన్ని కుసంస్కారిగా చిత్రించడం కడు శోచనీయం! ప్రభాకరం, వాసంతి బావలను గూర్చి అసభ్యంగా మాట్లాడి, వాసంతిని అపార్థం చేసుకున్నందున అతణ్ణి అలా చిత్రించినా, అలాగా మా ఇళ్లలో బావగార్ని మరదలు కనిపించక పోవచ్చునుగాని, వయసొచ్చిన మరదలు బావగార్కి ఉత్తరాలు వ్రాయవచ్చుననుకుంటా??? అనడంలో వాసంతి సంస్కారం వ్యంగ్యమేకదా! మరొక్క మనవి. రచయిత్రిగారు చిత్రించిన ప్రభాకరం వంటి వారు సమాజంలో ఉన్నారని అంగీకరించగలిగినవారు ప్రభాకరం ఊహించిన వాసంతి వంటివారు లేరు అనగల్గితే అది ఆత్మద్రోహమేనంటే సత్యదూరము కాజాలదేమో!

శ్రీమతి రమాప్రభాకర్ (విజయవాడ—2)

* * *

మీరు 8—8—69న విడుదల చేసిన పత్రికను నేను నా యొక్క మిత్రుడు యస్. ఐ. సాహెబ్ గార్ని చదివితిమి. అన్నిటికంటే "తపన", కథ మా యొక్క మనస్సును చాలా విశాలపూర్వకంగా పరిశుద్ధము చేసినది.

కొదాటి సత్యనారాయణ, (కేరఫ్ 56 ఏ.పి.వ్)

* * *

'ఈ లోకంలో న్యాయానికి జాగాలేదు' ఈ మాటను చాలా చక్కగా నిరూపించారు శ్రీ, పండింటి రాంబాబుగారు తమ న్యాయం కథలో వారికి అభినందనలు.

డి. ఉదయభాస్కర్ (మద్రాసు)



హెబియస్ కార్పస్ దరఖాస్తు పై యిటీవల ఆంధ్రప్రదేశ్ హైకోర్టు డివిజన్ బెంచి యిచ్చిన తీర్పు ననుసరించి విడుదలయిన మాజీకేంద్రమంత్రి, తెలంగాణా ప్రజాసమితి అధ్యక్షులు డాక్టర్ ఎం. చెన్నారెడ్డి.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 12-9-'69
శ్రీ సౌమ్యనామ సం॥ భాద్రపద మా. శు. పాడ్యమి
సంపుటము: 62 సంచిక: 1

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక


చచ్చిన గుఱ్ఱంతో సాధన
మొరార్జీ విషయం


'నువ్వు సిండికేటుని ఎందుకు సమర్థించావ్?'
'వాళ్ళు గెలుస్తారనుకున్నాను'
'ఇప్పుడు ఇందిరనెందుకు సమర్థిస్తున్నావ్?'
'ఆమె గెలుస్తున్నది గనక'


"కాంగ్రెసులో కలిసిపొండి. సమయం సందర్భం బాగుంది. లోలోపలే గూండు పుఠాణీ సాగించండి.


చంపడమా? మానడమా?
చైనా అణుశక్తి సామర్థ్యం



# రాష్ట్రపతి ఎన్నికలో రాజకీయాలు

భారత ప్రధానమంత్రికి సిండికేటుకు మధ్య అంతర్యుద్ధం కొనసాగుతున్నది. ప్రధానమంత్రి ధాటికి తట్టుకోలేక సిండికేట్ పిష్టంగ పడిపోయింది. ఇదొక చారిత్రాత్మకమైన సంగతి

శ్రీమతి అరుణా అసఫాలీ అనే ఒక బెంగాలీ మహిళ—'ప్రధానమంత్రి—సంపన్నుల మీదకు పేదవారిని పురికొల్పుతున్నది' అన్నారు. శ్రీమతి అసఫాలీగారు పక్కా కమ్యూనిస్టు, రష్యా సమర్థింపు వున్నవారు. పనిలో పనిగా ప్రధానమంత్రి అనుయాయులు వివిధరాష్ట్ర రాజధానులకు పరుగెత్తికెళ్ళి ప్రధాని తరఫున ప్రచారం ఆరంభించారు.

ఆంధ్రులు ఆంధ్రులను ద్వేషించడం ఇదేమీ కొత్తకాదు. బ్రహ్మానందరెడ్డిగారి మనుషులు గిరిగారికి వోటుచేశారు. ఇక్కడ ప్రధానిగారి ప్రచారం అవసరమే లేకపోయింది.

మేడమ్ గాంధీగారూ వూరుకోలేదు. ఆమెకూడా ఒక ఆట ఆడించారు. తెలంగాణా విషయంలో ఒక నిర్ణయం తీసుకోవాలి అనుకుంటే ఆందోళన కట్టిపెట్టాలి — అన్నారామె. ఆమె ఎప్పుడూ ముఖ్యమంత్రిగారి పక్షమే.

అలాగే సి. పి. గుప్తాగారి దగ్గరికి ప్రధానిగారి మనుష్యులు కొందరు వెళ్ళారు. వారు సి. పి. గుప్తాగారిని కదిలించారు ఆయన తన ముఖ్యమంత్రి పదవికి ఎక్కడ చేటు వాటిల్లుతుందో అని భయపడిపోయారు దేశాయిగారు తను చేయదగినంత తను చేశారు

అయితే సిండికేటు ఏం చేసింది? నథింగ్. కాంగ్రెసు ప్రెసిడెంటుగారి అర్థంలేని బెదిరింపులు తప్పితే అందువల్ల ప్రయోజనం సున్నా.

ఆగస్టు 22న కాంగ్రెసు ప్రెసిడెంటుగారు ఒక ప్రకటన చేశారు. ప్రధానమంత్రిగా శ్రీమతి గాంధీ 1972 దాకా నిరాక్షేపణీయంగా వుంటారని చెప్పలేను—అన్నది ఆయన ప్రకటన సారాంశం. ప్రజలతోపాటు మేడమ్ గాంధీగారూ దానికి



నూతన రాష్ట్రపతిగా పదవి స్వీకారం చేసిన శ్రీ వి వి గిరి, ప్రధాని శ్రీమతి గాంధీ, శ్రీమతి గిరి

కమ్యూనిస్టులకి అవకాశం కలిసి వచ్చింది. కాంగ్రెసు జాతీగీత్తులు రెండుగా రెండు మార్గాల్లో పయనిస్తున్నాయి. సమయమిదే అనుకున్నారు. ఇందిరా గాంధీ గారికి ఉచితసహాయం చేయడానికి ముందుకు వచ్చారు. మేడమ్ గాంధీకి మద్దతు ఇవ్వవలసిందిగా వారు కాంగ్రెసువారిని కోరారు! అది విచిత్రం.

సోమవారం శుభోదయాన అన్నివర్గాల శాంతి సమాలోచనలకి స్వస్తి పలికారు నిజలింగప్పగారు. వర్కింగ్ కమిటీ మీటింగు వాయిదా వెయ్యడానికి ఆయన ససేమిరా ఒప్పుకోలేదు. 'ఏవిధంగా అయినా సరే క్రమశిక్షణ పాటించి తీరాల్సిందే' అని పత్రికలవారికి చెప్పారు!

ప్రధాని అనుచరులూ ఊరుకోలేదు. వారూ చాకచక్యంగానే పనిచేశారు. శ్రీమతి సుభద్రా జోషీగారు ఢిల్లీ కాంగ్రెసు సభ్యురాలు. ఆమె భర్త జోషీ కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు. వాతావరణానికి సరిపోయిన టోపీ వెయ్యగల మరో కాశ్మీరు ముసల్మాను మీర్ ముస్తాక్ అహ్మద్‌గారు ఈయన జైప్రకాష్ నారాయణ్‌గారి అనుచరుడ నంటూనే ఎర్రటోపీతో తిరుగుతూ వుంటారు! ఈయనగారిది ముసల్మాను హృదయమే. ఢిల్లీ మసీదుల్ని శ్మశానాల్ని జాగ్రత్తగా చూస్తూవుంటారు. వీరూ, ఇంకా కొందరు కాంగ్రెసువారూ కలిసి కాంగ్రెసు భవనాన్ని ముట్టడించాలని చూశారు!

మేడమ్ గాంధీగారే గనక వోటింగులో నెగ్గకు రాకపోతే బోల్డంత దౌర్జన్యకాండ జరిగివుండేదన్నమాట! కాంగ్రెసు భవనానికి ఆవల ఆందోళనలకి, ధర్నాలకి అనువుగా గుడారాలు లేపారు.

కాంగ్రెసు భవనమున్న పార్లమెంటు స్ట్రీటంతా సెక్షను 144 ఆర్డరులో వుండిపోయింది. పోలీసువారు కలగజేసుకుని గుడారాలను ఎత్తివేశారు. సోమవారం మధ్యాహ్నానికల్లా కాంగ్రెసుభవనంచుట్టూ బలమైన పోలీసు బందోబస్తు ఏర్పాటు చేశారు. రాకపోకలకి పూర్తిగా ఆటంకమేర్పడిపోయింది.

మేడమ్ గాంధీగారి పార్లమెంటు

(XIII వ పేజీ చూడండి)






















'వదినా కాస్త జడవేద్దూ తొందరగా. కాలేజీకి టైమయి పోతూంది' అంటూ వెళ్లాను.

'మరీ అంత ఇదా! ఇరవై ఏళ్లు వస్తున్నా నేను జడవేయాలిటమ్మా? కాస్త పనుంది. ఇవాళ్టికి నువ్వేసుకోమ్మా జడ' అంటూ ముందుకు సాగింది, వదిన.

'అంత అర్జంటు పనా? ఓహో, మీ వారికి మేలుకొలుపు పాడాలా, లేకపోతే పళ్లు తోమాలా?' వదినతో హాస్య మాడాను.

'అన్నా చెల్లెళ్లకి ఆ మాత్రం పోలిక లేకపోతే ఎలా? చెల్లెలికి జడవేసుకోటం రాదు. అన్నగార్కి పళ్లు తోముకోడం రాదు' నవ్వుకుంటూ వెళ్లిపోయింది వదిన.

'వదినా జడవెయ్యకుండా తప్పుకున్నావు కాని కాస్త భోజనం పెడతావా?' పుస్తకాలు సర్దుకుంటూ అరిచాను వంటగదిలోకి వినిపించేలా.

'ఇవాళ్టికి ఆ పనికూడా నువ్వే చేసుకోమ్మా. ఆడబడుచూ ఇవాళ! చాలా పనుంది నాకు.'

'ఏమిటి వదినా తమాషాకా నిజంగానా? రేపు నన్నే వంటకూడా చెయ్యమంటావు కాబోలు.' ఆశ్చర్యంగా అన్నాను.

'తప్పేముందా తల్లీ ఎంత చదివినా వంట రాకపోతే, రేపు మా తమ్ముడుగారు వస్తే ఏంచేస్తావో ఎలా వండి పెడతావో ... అందుకు కాస్త ఇప్పట్నుంచే నేర్చుకోవాలి.'

'అప్పటిమాట దేవుడెరుగు. నాకు టైమయిపోయింది వెళ్తాను మరి.'

'నిజంగానే వెళ్లేవు, చిన్నీ. ఇవాళ చిన్న పనుంది. ఇవాళ్టికి కాలేజీ మానేయి. మీ అన్నయ్యే చెప్పమన్నారు'

'కాలేజ్ మానడ మెందుకు? ఏం పనో చెప్పు చేస్తాను.'

'ఏమిటి చిన్నీ కాలేజ్ అంటే అంత శ్రద్ధ వచ్చేసింది. ఈసారి కొంపతీసి పాసై పోతావా?' అన్నయ్య కాఫీతాగుతూ ఎగతాళి చేస్తున్నాడు.

'ఇదేమిటి మీరే ఇలా అంటే చిన్నికెంత ఇదిగా ఉంటుందో ఆలోచించండి' వదిన నెమ్మదిగా అన్నయ్య చెవి కొరికింది.

'పెద్ద నేను పాసయి ఉద్యోగం చేయాలా. ఏం? ఎప్పటికో అప్పటికి పాసౌతాను' లోపల బెంగగావున్నా ధీమాగా అన్నాను.

'కరెక్టుగా అన్నావే చిన్నీ నీకు చదివి తీరాలని ఏం లేదుగా. నీలాంటివాళ్లుంటే మిగిలిన వాళ్లకి ఛాన్సుంటుంది.'

'మాటల్లో పెట్టి కాలేజికి టైము కాస్తా దాటగొట్టేశారే' ఆశ్చర్యంగా నవ్వుతూ అంది వదిన. అన్నయ్య తన గదిలోకి వెళ్తాంటే నేను టైం చూసేసరికి అరగంట దాటిపోయింది. ఇంకేం కాలేజి? పుస్తకాలు బల్లమీద పడేసేను.

'సరేకాని ఏమిటి నాతోపని? ఇప్పటికైనా చెప్పడాన్కి ముహూర్తం కుదిరిందా ఇంకా లేదా.'

'ముహూర్తం దగ్గర పడవచ్చిందిలే, ఇంకెంతో సేపు లేదు. నువ్వు తొందరగా తెమలాలి' అంటూ వదిన 'మరి మీరు బజారుకు వెళ్తారా?' అని అన్నయ్య గది వైపుకి ముఖంతిప్పి అరిచింది.

'ఎక్కడికి వెళ్తామేమిటి వదినా'

'ఎక్కడికా నువ్వు ముందు పద'అంటూ మేడఎక్కించి, నా బీరువాలోంచి బెనారస్ పట్టుచీరతీసి కట్టించింది. రాళ్ల నెక్లెసు తీసిపెట్టింది. నా కయోమయంగా ఉంది. అన్నయ్య బజారునుంచి ఏవేవో

స్వీట్స్ తెచ్చాడు. నా తలనిండా పువ్వులు పెట్టింది, వదిన.

'ఏమిటి వదినా ఇదంతా, నాకేం అర్థం కావడంలేదు'

'పిచ్చిపిల్లా మా తమ్ముడుగారు వస్తారట నిన్ను చూసుకోడానికి' అంటూ ఆప్యాయంగా తల నిమిరింది.

'ఏమిటి వదినా ఇందుకా ఈ అట్టహాసం' విసుగు ప్రదర్శించినా సిగ్గుతెరలు కమ్మాయి. వదిన ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంది. 'వదినా' అంటూ ఆమె కౌగిలిలో ఆప్యాయతను వెతుక్కున్నాను.

'చిన్నీ ఏమిటీ మొద్దునిద్ర ఇంకా. అప్పుడే 'వదినా' అంటూ పలవరించేస్తున్నావు.' అంటూ అమ్మవచ్చి లేపడంతో గబగబా లేచి కూర్చున్నాను. నా కలని తల్చుకుని నేనే నవ్వుకున్నాను. అన్నయ్య దగ్గరకెళ్లి వెంటనే చెప్పేశాను. 'వదిన అంటే అంత ఆప్యాయంగానూ ముద్దుగా చూసుకోవాలి' అనుకున్నాను.

'అన్నయ్యా! కలలో వదిన ఎంత ఆప్యాయంగా చూసిందనుకున్నావు. మరి నిజమైన వదిన ఎలా ఉంటుందో ?' అని కలంతా చెప్పేశాను.

అన్నయ్యకూడా గంభీరత్వాన్ని తెచ్చి పెట్టుకున్నాడు, లోలోన మురిసిపోతూ వదినన్నగానే.

'సరే చెప్పటం అయిందా' అన్నాడు పైకిమాత్రం. 'ఆ అయింది వెళ్తాలే, అన్నయ్యా. నీ డ్రీమ్స్‌లో మధ్య నేను పానకంలో పుడకలా' చిరుకోపం నటిస్తూ తర్వాత నవ్వుకుంటూ వెళ్ళిపోయాను.

పెళ్లిపందిరి వేసేసారు. పెళ్లికళ వచ్చేసింది. ముగ్గులతో నేలంతా కన్నుల పండుగగా ఉంది. తోరణాలతో గుమ్మాలన్నీ నిండిపోయాయి. ఎవరిపనుల్లో వాళ్ళున్నారు. అన్నయ్య ఊహాగానాల్లో హడావిడిగా పరిగెడుతున్నాడు. నాకే ఏపనీ లేదు. అన్నయ్యను హాస్యం చేద్దామనిఉన్నా ఎందుకో 'డిస్టర్బ్ చెయ్యడం ఎందుకని' మనసు చెప్తోంది.

పెండ్లి ఘనంగా జరిగిపోయింది. వదిన వచ్చేసింది. నా ఆనందానికి అవధులు లేవు. వదిన ఎప్పుడు గదిలోంచి బయట కొస్తుందా అని కాచుకుని వున్నాను, కాలు గాలిన పిల్లిలా. ఎంతకూ రాలేదు. అన్నయ్య వచ్చాడు.

'చిన్నీ మీ వదినకి కాఫీ కావాలిట. కాస్త తెచ్చి పెడుదూ!' నిర్ఘాంత పోయాను. అన్నయ్య వదినకు లొంగిపోయాడు. వదినచేతిలో కీలుబొమ్మ. ఎంతయినా ఇంత దారుణమా!

'ఏమమ్మా! ఆడబడుచూ, ఇప్పటికైనా లేస్తావా? ఇదిగో కాఫీకూడా తెచ్చాను' అంటూ వదిన నన్ను లేపి హాస్యమాడుతుందని నేనూహించాను. అంతా తారుమారయింది.

'ఇదిగోనండి వదినగారూ! కాఫీ. ఇకనైనా లేస్తారా'? కాఫీకప్పు తీసుకుని వెళ్ళాను వదిన గదిలోకి: అప్పటికైనా

సిగ్గు పడుతుందని ఉద్దేశంతో. తెచ్చి కూర్చుంది, వదిన ఖాళీకప్పు ఎదురైంది ఆమెకు.

'ఛ. ఏమిటిది ? లేచింది మొదలు పనేనా, ఈ ఇంట్లో' అని విసుక్కుంది వదిన.

నా ఆశ్చర్యానికి అవధులు లేవు. ఎమ్. ఏ వదిన వస్తోందంటే ఎంతో ఆనందించాను. చదువుకున్న వదినకదా ! సరదాగా ఉంటుందని ఊహించాను. చదువుకున్న కోడలు అమ్మకి అంతగా ఇష్టం లేకపోయినా, నేను నచ్చజెప్పి ఒప్పించాను. ఇప్పుడెలా ? అసలే అమ్మమనస్సు సున్నితమైనది. అమ్మ నేం వినుక్కుంటుందో ! ప్రతిచోట అమ్మకి న్యాయం, మంచితనం కావాలి. వదిన హాయిగా పుస్తకం చదువుకుంటూ కూర్చుంది.

'ఎలాగైనా వదినని మార్చాలి' అనుకున్నాను. ఐనా రెండురోజులైనా చూడనిదే ఆవిడ మనస్తత్వాన్ని ఎలా అంచనా వేయడం ? ప్రొద్దున్న లేచింది మొదలు వదిన తన పనేదో చూసుకుని పుస్తకాలు పట్టుకునేది. అన్నయ్య ఆఫీసునుంచి రాగానే, అన్నయ్యకి అలవాటు లేకపోయినా వదినకోసం వాకింగుకి వెళ్ళేవాడు. ఇద్దరూ తిరిగి ఎనిమిది గంటలకు ఇల్లు చేరుకొనేవారు.

అమ్మను చదువురానిదానిగా ఊహించుకుంది, వదిన. కాని చదువున్నంత మాత్రాన్న సంస్కారం లేకపోతే ఏం ప్రయోజనమని గ్రహించలేక పోయింది

# మా వదిన

జ్ఞానంలేని వదిన. నెల్లాళ్ళు గడచిపోయేయి. నేనూహించిన వదిన వేరు. మావదిన వేరు.

ఆరోజు క్లబ్ సెంటర్‌నుంచి నోటీసు వచ్చింది, యానివర్సరీ అని.వదినకుచెప్పాను.

'ఏం చేస్తారులే మహా పెద్ద !' పెళ్ళేమి టన్నట్లు కనీసంగా అంది.

ఇటువంటి సమాధానం వస్తుందేమోనని ఊహిస్తూనే వెళ్ళాను కాబట్టి పెద్ద లెక్కచేయలేదు. వదిన మనస్తత్వాన్ని అన్నయ్యకూడా బాగా అర్థం చేసుకున్నాడు. ప్రక్కగదిలో షేవింగ్ చేసుకుంటూన్న అన్నయ్య వచ్చాడు మామాటలువిని.

'అదేమిటి సరూ ! క్లబ్బులంటే నీకు చాలా ఇష్టం కదా ! నువ్వు లేనిదే ఏ మీటింగూ జరుగదు అంటూ మీ నాన్నగారు గొప్పగా చెప్పారు' కాస్త ఎగతాళి కనిపించింది అన్నయ్య మాటల్లో.

'దానికీ దీనికీ తేడాలేదూ ! కాలేజిలో నేనే సెక్రటరీని. నేను లేకపోతే ఏపనీ జరగదు. మాప్రిన్సిపాల్ నేను కనిపించకపోతే ఉండలేక పోయేవారు' నిజానికి ఒకప్పుడు అలా జరిగినా ప్రస్తుతం ఆ మాటల్లో గర్వం స్పష్టంగా కనుపిస్తూంది.

'నిజమే మరి. చిన్నీ! వదిన రాకపోయినా నేను వస్తాలే' అన్నాడు అన్నయ్య. నేను మెల్లగా జారుకున్నాను అక్కడనుండి. అన్నయ్యతో వదిన రాకుండా ఉండదు. ఎలాగూ వస్తుంది.

కార్యక్రమం ప్రారంభమయింది. స్పెషల్ గెస్టుల సీట్లలో అన్నయ్యా వదినా కూడా కూర్చున్నారు. ఆ సెంటరుకి అమ్మ ప్రెసిడెంటు అవడం వల్ల కలెక్టరుగారి భార్య ప్రక్క స్థానం లభించింది. ప్రేయర్‌సాంగ్ వంతు నాది. నా కంఠాన్ని గానగాత్రం అని అంటారు అంతా, ఏ మీటింగు జరిగినా పాట వంతు నాదే. అప్పటికే మా వదిన ముఖం ఎర్రబడి పోయింది, నా పాట విని మరింత సిగ్గుతో, ఈర్ష్యతో నిండిపోయింది. అమ్మ పెద్ద చదువులు చదవక పోయినా ఆవిడ మంచితనమే ఆవిడకి ఆ స్థానమిచ్చింది.

మీటింగ్ అయిపోయింది. ఉపన్యాసాల్లో ఆ సెంటర్‌ని చాలా మెచ్చుకున్నారు. ఆ గ్రామంలో పెద్ద క్లబ్బులుగాని, సంస్థలుగాని ఏంలేవు. అందరికీ ఉపయోగపడేలా ఒక కుట్లు సెంటరు పెట్టింది. అందరూ చదువులకే వెళ్ళిపోతే మరి నిరుద్యోగ సమస్య పెరిగిపోతూంది. కుట్లూ, అల్లికలు మొదలైనవి నేర్చుకుంటే కాలక్షేపం లేని వారికి బోలెడు కాలక్షేపం. ఆర్థికంగా వెనకబడినవారు ఈ విద్యవలన సంపాదించుకోవచ్చును.

అమ్మ ప్రారంభించిన ఈ సెంటర్ని అందరూ ప్రశంసిస్తున్నారు. కలెక్టరుగారి భార్య, ఆవిడ ఉపన్యాసంలో ఈ సెంటర్నీ, దీనికి అంతకూ కారకురాలైన అమ్మనీ మెచ్చుకున్నారు. ప్రతిచోటా ఉన్న మామూలే మా ఊళ్ళోనూ ఉంది. కొందరు ఈర్ష్య పడ్డారు. అసూయపడ్డారు. కాని వాళ్ళని ఎవరూ లేవనెత్తడానికి ప్రయత్నించలేదు. కలెక్టరుగారి భార్యతో అమ్మ హిందీలో, మాట్లాడడం విని వదిన ఆశ్చర్యపోయింది వదిన ముఖంలో రంగులు మారాయి. ఒక ప్రక్కనుంచి నేను ఒక కన్నుంచాను వదినమీద.

అందరూవచ్చి అమ్మచుట్టూ చేరారు. ఎవరుకుట్టిన దుస్తులను వారు ప్రదర్శించారు. గోడలకు పెట్టినవి, మొదలైనవన్నీ తీసుకుంటున్నారు కొందరు. అమ్మ అందరితోనూ ఎంతో ఆప్యాయంగానూ చనువుగానూ మాట్లాడుతోంది. నాకంటే పెద్ద వాళ్ళందర్నీ నేను స్వయంగా వెళ్ళి పలుకరించాను. వదినని ఎవరూ పలుకరించలేదు, మాట్లాడలేదు. ఆమె ఉనికిని ఎవరూ గ్రహించలేక పోయేసరికి కాస్త



ఉడుకుమోత్తనం వచ్చింది. ఎలాగో ఫంక్షన్ అయేవరకూ నిగ్రహించుకుని కూర్చుంది, పటిన ఎమ్. ఏ ఇంటికి వచ్చేం అందరం ఎంబాసిడర్‌లో అమ్మ డైనింగ్ హాలువైపు నడచింది. నేను మేడ ఎక్కబోతున్నాను. నాగదిలోకి వెళ్లడానికి.

'ఏంమ్మా చిన్నీ, నీకు పాటవచ్చని మాటమాత్రమైనా చెప్పలేదేం. అంత పరాయిదాన్నా.'

'వదినా, నన్నెందుకు నిష్ఠూరంగా మాట్లాడతావు? అడక్కుండా చెప్పడం నాకు చేతకాదు. పోనీ ఇప్పుడైనా తెలిసిందిగా, మా అమ్మ ఆ క్లబ్ ప్రెసిడెంట్. అడిగావు కనుక చెప్తున్నాను.' అంటూ మేడమీదకు వెళ్ళిపోయేను.

అప్పుడే కారు గేరేజ్‌లో పెట్టివస్తూన్న అన్నయ్య మా సంభాషణ విన్నాడు. వదిన ప్రవర్తనకు అన్నయ్యకు విసుగెత్తినట్లుంది.

'ఏమిటి సరూ! మా చెల్లెల్ని ఏమిటంటున్నావు' నవ్వుతూవచ్చాడు అన్నయ్య. వదినకు మరీ కోపంవచ్చింది.

మర్నాడు ప్రొద్దు పోయేవి అమ్మకు అన్నిపనులూ సాయం చెయ్యడం చూసిన నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. నిర్ఘాంతపోయి నిలుచున్నాను. తర్వాత అర్థమయింది.

మాకు చిన్నప్పటినుంచీ అమ్మ బోధించేది; ఎంత మహానుభావులైనా వారిని మించిన వారొకరుంటారని. ఆ విషయమే ఆ రాత్రంతా అన్నయ్య వదినకు బోధించాడని గ్రహించగలిగాను.

'ఎందరో మహానుభావులు...' అనే త్యాగరాజు రచించిన పంచరత్న కీర్తన పాడాను. వదిన కాఫీ కలుపుతూ ఉంది. వదిన సిగ్గుతో, కోపంతో నావైపు చూసింది. 'మనకన్నా గొప్పవారు ఎప్పుడూ వుంటారు త్యాగరాజు ఎంతచక్కని పంచరత్న కీర్తనను చేసాడో' అని మాట మార్చేను.

* * *

మరునాడు...

'ఇవాళ ఆదివారంకదూ! అన్నా చెల్లెళ్ళకి ఎనిమిదింటికి తెల్లవారిందా?' అంటూ కాఫీతెచ్చి మా ఇద్దరికీ బల్లమీద పెట్టింది వదిన. వదినలోని మార్పుకు అమ్మ తృప్తిగా నవ్వుకుంది.

దక్షిణ ఫ్రాన్సుకు చెందిన సీసెట్ అనేచోట టొమాటో పంట అత్యధికం అయి ఏం చెయ్యాలో తెలీక ఆ మొత్తాన్ని సముద్రంలో పోశారట. సముద్రం మాత్రం తక్కువతిందా! అవన్నీ మళ్ళీ తెచ్చి ఒడ్డున పారేసిందట.

*　　　*

అన్నం వండనంటే నడిచేదని 50 ఏళ్ళ కస్తూరిలాల్ తన భార్యను గొడ్డలితో నరికేశాడట. ఇది అహ్మదాబాదుకు చెందిన ఘోరం. కస్తూరిలాల్ ప్రెస్ ఇన్ఫర్మేషన్ బ్యూరోలో పని చేస్తున్నాడట.

## దొంగతనం - దేశసేవ - పింఛను

'ఈ చేత్తో యెన్నో దొంగతనాలు చేశాను అలా చేసి, ధనికులడబ్బు దోచి బీదవారికి పెట్టాను తద్వారా దేశానికి మేలు చేకూర్చాను, ఈ చేత్తో ఎన్నివందల కిలోల బంగారం దోచాను! ఎన్ని నగల్ని




గుర్రాలు ప్చ్...ఏం లాభం.....ఈ పనిమాని ఏ చెప్పులు కుట్టుకుని బ్రతికినా యీపాటికి రెండు ఇల్లూ, యిల్లాలూ అయినా వుంటుండేవాను. అన్నాడట ఓ గజదొంగగారు జపిరోపిసరి ఓ. ఇతను రెండవ ప్రపంచయుద్ధం తరువాత దొంగతనం చేయలేదు. తన 83 ఏళ్ళ జీవితంలోనూ 36 ఏళ్ళు జైల్లోనే గడిపాడట. కనుక అతడిప్పుడు పెన్షన్ కోరుతున్నాడట. ఇదొక విదేశీ ముచ్చట.

*　　　*　　　*

కేరళలో వయస్సు వచ్చిన ఆడపిల్లలను పట్టి, రోమ్, వెస్ట్ జర్మనీ వంటి దేశాలకు పంపిస్తున్నారని, అక్కడవారిని నన్స్‌గా చేస్తున్నారని, ఈ చర్య కేరళలోని కాథలిక్ మత అధికారులు చేస్తున్నారనీ కేరళ ఎం.పి.లలో రాజన్ అడిగిన ప్రశ్నకు శ్రీ నంబూద్రిపాద్ అంత సంతృప్తికరంగా సమాధానం యిచ్చినట్టు లేదు. ●




**పి. బి, ఆదోని**

ఒక మనిషి ఉన్నతమైన స్థితికి రావాలంటే అతని కృషి ముఖ్యమా? అదృష్టము కలిసి రావడం వలనా?

కృషి ముఖ్యం. దానికితోడు అదృష్టం కలిసిరావాలంటే నిగర్విగా ఉండడం ముఖ్యం. లేకుంటే కావ్ సెన్స్ టేషన్ తప్పి— ఎంత ఎత్తు ఎంత కష్టపడి ఎక్కాడో అంత ఎత్తునించి వూహించనంత త్వరితంగా [illegible].

**పి. జి ఆర్, కాపవరపుకోట**

[illegible] ఇష్టము లేని అమ్మాయిని పెళ్ళి [illegible] పడి చేశారు. మూడు [illegible] గడిచినా మా ఇద్దరి మధ్య [illegible] రేదు...

[illegible] ఇష్టానికీ వీా పెద్దల ఇష్టానికీ అమ్మా[illegible] అధికారం ఎవరిచ్చారు మీకు? పెళ్ళంటూ చేసుకున్నాక అమ్మాయిని ఆదరించి తీర[illegible] బాధ్యత మీది.

**జి. ఎ. ఎల్, హైదరాబాదు**

మీ మొదటి రచన ఏది? అది పత్రికలో ప్రచురితమైనప్పుడు మీరెలాంటి అనుభూతి చెందారు?

తప్పనిసరియై నేనో వ్యాసం రాశాను. అది ఆ వారం పత్రికలో వస్తే తెలిసిన వాళ్ళెవరేనా చూసి అడుగుతారేమోనని నాలుగురోజులు లీవు పెట్టాను!

**ఎస్. ఏ. ఆర్, అచ్చంపేట**

చిన్న నేను చిన్నన్నానా? నీ నాన్న [illegible]న్నాను...యిలాగే ఒకే అక్షరము మూడుమో[illegible]ంచి...

అన్నా క్షమించు! నన్ను నేను నన్ననుకొన్నానా? [illegible] 'నిన్న నేను నిన్నన్నానా నీ నాన్ననన్నా' నన్న[illegible]న్నప్పుడు చూసి!!

**కె. ఎస్, జబలపూరు**

ఒకరికి జవాబిస్తూ కవిత్వం రాయాలంటే 'ఆకలైనా కావాలి. లేక విరహమైనా ఉండాలి' అని వ్రాశారు. అంటే కవులందరూ ఆకలితో అలమటిస్తూ విరహంతో ఛస్తూంటేనే కవిత్వం రాయకల్గు తారనేగా. అయితే మా అన్నయ్య కవిత్వం రాయడానికి...

ఆహా విక్షేపం!

**కల్యాన్, మెడ్చల్**

శరత్ సాహిత్యంలోని స్త్రీ పాత్రలు హృదయాలని కదల్చుతాయెందుకు?

మా పురుషులు కోరుకునే 'అసహాయత' మూర్తీభవించి ఉంటుంది. అందుకు.

**ఎమ్. ఎస్, బళ్లారి**

మాటలకే చిటుక్కుమిని బిక్కి బిక్కి ఏడ్చే ఆడవారు అసమర్థులా? లేక...

కంట తడి అసమర్థతకి చిహ్నంకాదు. ఆర్ద్రతకి.

**పి. ఆర్. ఆర్, ధూళిపూడి**

రామలక్ష్మిగారూ తల్లి భార్య వీరిద్దరిలో ఎవరు ముఖ్యం?

ఇద్దరూ ముఖ్యమే. కాని పెళ్లికి ముందు తల్లిది ప్రథమస్థానం. పెళ్లి తరువాత భార్యది ప్రథమ స్థానం— పురుషుని జీవితంలో.

**జి. హెచ్, అన్నవరం**

నవనాగరికత పెరిగిపోయే ఈ రోజుల్లో ఆడపిల్లల వివాహం ఒక సమస్యగా ఉంది ఎందువలన.

నాగరికత పైపూతగానే అబ్బుతోంది గాని సహజంగా పెరగడం లేదు. అందుకే వో పక్క అతి నాగరీకులం అనుకుంటూనే ఆటవికులలాగ ప్రవర్తిస్తుంటారు. ఇప్పుడీ కట్నాల నేరాలకీ పూర్వపు సంప్రదాయాలకీ తేడా ఏముంది? ఎవ రెక్కువ పశుగణాన్నిస్తే వాడికి పిల్ల నిచ్చేవాట్ట పూర్వపు తండ్రి. ఇప్పుడు తక్కువ డబ్బడిగితే వాడికే అంట కట్టేయడానికి సిద్ధంగా ఉన్నారు. ఉన్న పెళ్ళాడ్ని కిన్ని వేలు పుచ్చుకున్నానని తల పోసుకుందుకేనా సిగ్గుపడని నాగరికులున్న యీ రోజుల్లో వివాహం అందరికీ సమస్యే— ఒక్క ఆడ పిల్లలకే ఏం కర్మ?

**ఎమ్. కె. ఎమ్, హైదరాబాదు**

ఇంతవరకు మీ జీవితంలో జరిగిన 'పచ్చనిపానుపువెచ్చగ పిలిచె'...'హృదయాన కదలాడు బాబు'ల మధ్యకాలంలో అరుదైన అంతర్యాలుంటే చెప్పండి చూద్దాం.

చెప్పడానికేం చాలా ఉంటాయి కృష్ణమూర్తి గారూ, మాదేం అమర్చిన సంసారం కాదు. కొంప తుడుచుకునే కొత్త చీపురు దగ్గిర్నుంచి అన్నీ అమర్చుకున్నాం. సీ కిన్నిచ్చాం అని ఎవరూ మమ్మల్ని వేలెత్తి చూపలేని గర్వింపదగిన ఇలా తలపు సుఖజీవనం మాది......

**ఎన్. ఆర్. పి, ఖమ్మం**

కాని .... రానురాను మీ సమాధానాలు చదవడానికే నేను పత్రిక కొనవలసి వస్తూంది. మీరు నేర్పుతో అనుభవంతో ఇస్తున్న జవాబులు నన్నెంతో ముగ్ధుణ్ణి చేసాయి. కాని కొన్ని ప్రశ్నలని మీరు చాలా యీజీగా తీసుకుని జవాబులిస్తున్నట్టు గమనించి కాస్త నిరాశ చెందాను.

జీవితంలో బరువైనవి ఎన్నో ఉన్నాయి. వాటికి మనం జవాబులు చెప్పలేం. కాని లైట్‌గా తీసుకుని నవ్వుకుంటే కనీసం ఆ క్షణం మనసు తేలి కౌతుంది గదా!

# చవితి జోకులు

Jayadev




















# అక్షయ తూణీరం

## కార్టూను గేయాలు

*** శిశిర ***




1. మొట్ట మొదట శ్రీ శ్రీకి
నమస్కార బాణమేసి
ప్రాస క్రీడల జాడల
నవ్వించెద, కవ్వించెద.

2. అక్షయ తూణీరమ్మున
అందరికీ చోటు కద్దు
కేవల మివి కార్టూనులు >
మొగములు చిట్లించవద్దు.



3. రామమతీ భానుకృష్ణ
రాసిన కథలకు బహుమతి



సాహిత్య అగాధమికి
చెడిందంట ఉన్నమతి.




4. సత్యనాథ విశ్వాయణ
ధర్మశాస్త్ర వన కేసరి
< ముసిలాడికి నలుగు రేసి
ముద్దరాంద్రు తప్పని సరి.

5. శాస్త్రి కొండ రాదనాథ
సాయిబైన నేమి బాధ
సారా కథలోని మత్తు
సంఘానికి మరమ్మత్తు.

V (ఇంకా ఉంది)



**అవి-ఇవి...**

## తమిళనాడులో గోద్రెజ్ ఉత్పత్తి పథకాలకి ప్రభుత్వం సహకారం

గోద్రెజ్ వ్యవస్థాపకులు, మహాత్మాగాంధి మిత్రులు అయిన కీ. శే. ఆర్దేషిర్ బి. గోద్రెజ్ శతజయంతి సందర్భంగా యిటీవల స్థానిక సఫైర్ థియేటర్‌లో గోద్రెజ్ సంస్థవారు ప్రత్యేక సమావేశాన్నొకదాన్ని ఏర్పాటు చేశారు. ఈ సమావేశానికి ముఖ్య అతిథిగా మద్రాసు విద్య, ఆరోగ్యశాఖల మంత్రి శ్రీ వి. ఆర్ నెడుంజెళియన్ విచ్చేశారు.

గోద్రెజ్ ఉత్పత్తులన్నిటినీ ఈ సందర్భంగా ప్రదర్శించడం జరిగింది. మహాత్మాగాంధిపై డాక్యుమెంటరీని, గోద్రెజ్ సంస్థ సాధిస్తున్న అభివృద్ధిని, ఉత్పత్తులని వివరించే వర్ణచిత్రాన్ని ప్రదర్శించారు.

ప్రారంభంలో శ్రీ ఎస్ పి గోద్రెజ్ సమావేశానికి వచ్చిన ముఖ్య అతిథి శ్రీ నెడుంజెళియన్‌కి తదితరులకి స్వాగతం చెప్పారు. సంస్థ అభివృద్ధిని గురించి వివరిస్తూ, లాభాలు పనివారికి సౌకర్యాలు కలిగించడానికి ఎలా వినియోగింపబడుతాయో వివరించారు. నిరంతరమైన ఉక్కు కొరత, అధిక పన్నులు వల్ల ఎక్స్‌పెన్షన్ విస్తృత పథకాలు అమలు చేయడానికి వీలుపడటం లేదని ఆయన అన్నారు.

మంత్రి శ్రీ వి ఆర్. నెడుంజెళియన్ మాట్లాడుతూ గోద్రెజ్ పెద్ద జాతీయ స్థాయి సంస్థ అని పేర్కొన్నారు సంస్థ అభివృద్ధిసాధన గోద్రెజ్ వారు గాంధి సిద్ధాంతాలకి కట్టుబడి ఉండటం వల్లనే సాధ్యపడిందని అన్నారు. తమిళనాడులో ఈ సంస్థ తలపెట్టిన ఉత్పత్తి పథకాలు కార్యరూపం ధరించడానికి తమిళనాడు ప్రభుత్వం పూర్తి సహకారాన్ని అందిస్తుందని కూడా ఆయన హామీ యిచ్చారు.

సమావేశం ఆఖరులో శ్రీమతి కమల, రాధ, వసంత ప్రదర్శించిన నృత్యాలు ఆకర్షణీయంగా ఉండి ప్రేక్షకుల్ని ఆకట్టుకున్నాయి.

—ఎం. ఆర్.

* * *

17—8—69 వ తేదీన ఆంధ్ర సాంస్కృతిక సంఘం, చండీఘర్‌వారు హాస్యప్రవీణ శ్రీ జి. బి. వెంకటాచార్యులు (మాడుగుల, విశాఖజిల్లా) వారి నాహ్వానించి హాస్యప్రదర్శనం ఇప్పించారు. (ఒ. వి.)

## శ్రీ టి. వి. రంగాచార్యుల కాలధర్మం

ప్రముఖ పత్రికా రచయిత, అనేక భాషావేత్త, విద్వాంసుడు శ్రీ టి. వి. రంగాచార్యులు 26 ఆగస్టు మంగళవారం రాత్రి 8—00 గంటలకు గుండె పోటుతో హఠాత్తుగా మరణించారు. ఆయన వయస్సు 60 సంవత్సరాలు. భార్య, ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు ఉన్నారు.

ఆయన భారతి మాసపత్రికలోను, ఆంధ్ర పత్రికలోను పని చేశారు. ఏడు సంవత్సరాలుగా శ్రీ శేషాచలం అండ్ కో వారికి విద్యావిషయక సలహాదారులుగా వుంటున్నారు.



# భాంపే గండ్రం

ఫాలాక్షుడు

లోకేశ్వర్రావు పుడుతూనే అందుక్కావలసినంత లోకజ్ఞానం సంపాదించాడని అతన్ని ఎరిగున్న ఎవరైనా ఇట్టే ఒప్పుకుంటారు. బారసాలనాడే పేరంటాల చేతుల్లోంచి తల్లి తీసుకుని వుయ్యాల్లో పడుకోబెడితే గుక్కపట్టి ఏడ్చాడని, చివరికో అందమైన అమ్మాయి ఎత్తుకుంటే గమ్మున వూరుకున్నాడని అతన్ని గురించి చెప్పేవాళ్ళు చెప్తారు.

దినదిన ప్రవర్ధమానుడై స్కూలు కుర్రాడి స్టేజికి ఎదిగేసరికి తన చుట్టూవున్న లోకాన్ని చూసి అసలు విషయం చప్పున పసిగట్టేసి, అందరిలాగా తనకూ ఏదో ఒక రోజున నిశ్చయంగా పెళ్ళయి తీరుతుందనీ, అది మానవుని దశల్లో ఒకటనీ, తప్పించుకోడం అసాధ్యమనీ, అనవసరమనీ పసికట్టి తత్సంబంధమైన పుస్తకాలు పెళ్ళికి సంబంధించిన గ్రంథాలు చిన్నచిన్నవి మొదలు లైబ్రరీ సైజు పుస్తకాలవరకూ అవపోసన పట్టేశాడు.

ఇన్ని చదివినా తనలో శక్తి, తెలివి గ్రహించి తలిదండ్రులు తనకు పెళ్ళి ఏర్పాటు చెయ్యనందుకు చింతించి, వగచి, యింకా చాలా టైముందన్నందువల్ల ఆ గ్రంథాలన్నీ పునర్విమర్శచేసి వాటి మీద తన అభిప్రాయాలను రాసి మరో గ్రంథంచేసి దాచుకున్నాడు. ఆ గ్రంథన్ని ఎలాగయినా అచ్చు వేయిద్దామన్న తీవ్ర సంకల్పంతో.

ఇంకా చాలా టైముండడంవల్ల ప్రాక్టికల్ మాన్ అవుదామని నూటొక్కసారి ఆలోచించి నిర్ణయించుకున్నాడు. తల్లి దగ్గర, వూళ్ళో పెళ్ళవుతున్న పెళ్ళికొడుకు లందరికీ తన యీడేవున్నట్టు సూచించి చూశాడు కూడా. తలిదండ్రులు బొత్తిగా అజ్ఞానంలో వున్నట్టు కనబడ్డారు.

"పెళ్ళి అనేది ఎప్పుడూ చిన్న వయస్సులోనే చేసుకోవాలి. ఆ వయస్సులో చేసుకుంటేనే వయస్సు మళ్ళేసరికి పిల్లలు చేతికి అందివస్తారు" అన్న ముక్క తల్లికి తగు సమయాల్లో చెప్పాడు. ఆవిడ అవునురా అనడమే గాని, సహాయం చెయ్యలేదు. పెళ్ళిమీద తీవ్ర వ్యాసం ఒకటి రాసి ఝామ్మని వో పత్రికకు పంపితే గోడకి కొట్టిన బంతిలా ఆ వ్యాసం, గిర్రున తిరి గొచ్చింది. లోకేశ్వర్రావు పోస్టుమాన్ వెళ్ళిపోయాక, కన్నీరు చొక్కాతో తుడుచు కున్నాడు.

మూడో ఫారంలోకి వచ్చిన కొత్తలో "హెమోగ్లోబిన్" అనే అద్భుత పదార్థం ఒకటి రక్తంలో వుంటుందని మాష్టారు చెప్పగా విని, జీవిలోని ఆడ మగ వ్యత్యాసం యీ హెమోగ్లోబిన్ నిష్పత్తిని బట్టి వుంటుందని వూహించి, వో సైన్సు పరీక్షలో రాస్తే ఆ సైన్సు మాష్టారు పనిమాలా పిలిచి రెండు లెంపకాయలు కొట్టి రెండు గంటలసేపు బెంచీ ఎక్కమన్నాడు. ఆ శిక్ష పూర్తయినా అతనికి శిక్ష పడిన కారణం తెలియలేదు." మేష్టర్ల

మకన్నా ఎక్కువ తెలివైన కుర్రాళ్ళను మెచ్చరు" అని వో పుస్తకంలో బంగారు వాక్యాల జాబితాలో రాసుకున్నాడు.

ఐదో ఫారంలోకి వచ్చిన కొత్తలో అతను స్త్రీ అనే విషయం మీద వో గ్రంథం రాసి, వో నోబెల్ బహుమతి కొట్టెయ్యాలని సరదాపడి, కనబడిన ఆడవాళ్ళకేసి నిశితంగా చూడ నారంభించేసరికి హెడ్మాష్టరు పేక బెత్తంతో చేతిని వాయిగొట్టి "బి" సెక్షనులో పడేసి, "టేక్‌కేర్" అన్నాడు. ఆ పదానికి "జాగ్రత్త తీసుకో" అని తెలుగు చెప్పుకున్నా ఎవర్ని గురించిన జాగ్రత్త తీసుకోవాలో తెలీక మళ్ళీ ఆయననే అడిగి రెండోవిడత తన్నులు తిన్నాడు. హెడ్మాష్టరు మళ్లీ అదే ముక్క అన్నాడు.

"యస్సర్" అనేసి వచ్చేశాడు చేతులు నలుపుకుంటూ.

లోకేశ్వర్రావు నిరుత్సాహ పడలేదు. అధైర్య పడలేదు. గంట కొట్టేంతవరకూ వివిధ ప్రదేశాల్లో నించుని ఒక్క ఆడపిల్లనైనా విడువకుండా చూసేవాడు. గజగమన అన్న ముక్క ఎందుకు పుట్టిందో తెలుసుకోడానికి వూళ్లో వున్న ఏనుగు దగ్గర రోజున్నర కాసినా, ప్రయోజనం లేక పోయింది.

మారుతున్న నాగరికతను అతను చక్కగా పసిగట్టానని సంబర పడ్డాడు. ఒక దశలో ఆడపిల్లలకు జడ కుప్పెలు, పాంజీపట్టాలు, చెవులకు బుట్ట లోలక్కులు, కాలిచీలమండవరకూ వచ్చే పరికిణీలూ అందమని గ్రహించాడు. అలాగా జూకాలు లోలాక్కులుగా మారడం, లోలాకులు రింగులుగా మారడం, వంటి జడ క్రాస్ విభజన పద్ధతిలో రెండు జడలవడం చూశాడు.

వూహాపోహ్లా, ఇమగో దశల్లాగ బుట్టలోలక్కులు, లోలక్కులు, రింగుల దశ ఆడవారి అలంకరణ మార్పులని రాసుకున్నాడు.

తన జూకాల అభిరుచిని లోలాక్కుల మీదుగా రింగులకు తెచ్చుకున్నాడు. ఆనక రెండు జడలంటేనూ తెగ అభిమాన పడ్డాడు. ఒక జడలోనే బారెడు పువ్వులు పెట్టడం, ఒకే చేతికి గాజులు వేసుకోడం పొడుగుపాటి పరికిణీ (వాళ్ళక్కయ్యలది) కట్టడం వో నైలాను వోణీ వేసుకోడం, వోణీ జారకపోయినా అప్పుడప్పుడు లెక్కగా పైకి తోసుకోడం, మేపెడు పుస్తకాలను పిల్లాణ్ణి ఎత్తుకున్నట్టు ఎత్తుకోడం— అన్నీ అతను గమనించాడు.

చీరకట్టు విధానాలను నిశితంగా పరిశీలించాడు. కుచ్చెళ్లన్నీ మధ్యకు వచ్చేలా కట్టడం, లేక ఎడమ పక్కకి బొత్తుగా వచ్చేలా కట్టడం, పైట చెంగును బొడ్లో ఒకసారి, జాకట్లో ఒకసారి దూర్చడం అన్నీ గ్రహించాడు.

దరిమిలాను ఐదో ఫారం రెండోసారి తప్పి, లాఘవంగా మూడోసారికి . ప్యాసయి, స్కూలు ఫైనలుకు వచ్చేసరికి చదువు మీద విరక్తి కలిగి చదువు పేరు చెపితే వికారం కలగసాగింది. కానీ తన కార్యక్రమాలకు స్కూలంత మంచి పరిశ్రమ దొరకదని గ్రహించి, చదువుకునేందుకు గాక పోయినా, స్కూలుకు వెళ్ళితీరాలని నిశ్చయించుకున్నాడు.

తన గ్రంథన్ని తనొక్కడే చూసి ఆనందించకూడదనీ, రోగానికి, గ్రంథనికి పబ్లిసిటీ అవసరమనీ గ్రహించి నమ్మకమైన యిద్దరు స్నేహితులకు చూపించి, వాళ్ళ సలహామీద అందులో కొన్ని మచ్చుతునకలు నాటి- ఈనాటి స్త్రీలు, అనే శీర్షిక మీద పంపించాడు. ఆశీర్షిక బెజవాడ పత్రిక ప్రచురించే సరికి ఎలక్షన్స్‌లో గెలిచిన యమ్మెల్యేలాగ వుబ్బిపోయి, స్నేహబృందం పొగడ్తలన్నీ స్వీకరించి, దీపాల వేళ దాటి, ఇంటికి వెళ్లేసరికి తండ్రి తనకోసం గడపదగ్గర కాసుకున్న సంగతి గ్రహించి, ఇంతసత్ పుత్రుని కన్నందుకాయన ఆనందిస్తూ తనరాకకోసం ఎదురు చూస్తున్నాడని సంతోషించాడు. జుట్టుపుచ్చుకుని రెండు తన్నేవరకూ అతనికి మైకం వదలలేదు.

తలిదండ్రులు తమ పిల్లలను పొగడరనీ,పొగడ రాదనీ, మహాకవి భరవి అంతటివాడినే తండ్రి పొగడలేదని, దాంతో కసితో భార్యని తండ్రిని హత్యచేయబూని, ఆనక పశ్చాత్తాపపడ్డాడనీ బామ్మచెప్పిన కథను మననం చేసుకుంటూ తను అలాంటి కొడుకు కానందుకు తన తండ్రి అదృష్టమేకారణం అనితీర్మానించుకున్నాడు.

తను సేకరించిన విషయాలన్నీ తిరగరాసి, న్యూయార్క్‌కి పంపితే రవీంద్రునికివచ్చిన నోబెల్ బహుమతి వంటిది తనకి వస్తుందని వో స్నేహితుడు చెప్పిన, చేసిన ప్రోత్సాహంతో రాయబోయి, విషయం ఇంగ్లీషులో రాయాలని తెలిసికాస్త, నోబెల్ బహుమతియిచ్చేవారి ఎడ్రసు తెలియక కాస్త నిరుత్సాహ పడ్డాడు.

స్కూలు దాటి కాలేజీలో జేరేసరికి అతని విజ్ఞానం విర్రవీగింది. ఏదైనా ఒకవిషయం చూడగానే శాస్త్రవేత్తలు అది ఎందుకు అలావుంది అనేకారణాన్ని అన్వేషిస్తారని కెమిస్ట్రీ మాస్టారన్న ముక్క అతని గుండెలకి నాటుకు పోయింది. డార్విన్, ఎవోగాడ్రొ న్యూటన్, మార్కొనీ వంటి వారు ఎన్ని ఆడ్డంకులు వచ్చినా ఎదుర్కొని పరీక్ష చేసి, కృతార్థులై,లోకానికి విజ్ఞానబిక్ష పెట్టారని తెలుసుకుని, తనూ లోకానికి అలాటి బిక్ష పెట్టి తీరాలని వాడెవడో అన్నట్టు తన ది కారణజన్మ అనీ నమ్మాడు.

ఆలోగా జాకట్టు ఫ్యాషను మారింది.

కారణాంతరాలు వల్ల వరుసగా మూడుసార్లు కాలేజీమాని, నాలుగోనాడు కాలేజీకి వచ్చిన లోకేశ్వరరావు వులిక్కిపడి, థీనాబెడ్డు అని వీపుచరుచుకున్నాడు. వెనకాల గుండీలున్న జాకట్టుకు ఆ గుండీలు ఆడవాళ్లు ఎలాపెట్టుకుంటారా అని ఆశ్చర్యపోయి తన చొక్కాకి వెనక గుండీలు వున్నట్టు వూహించుకుని చేతులు వెనక్కు అందించేసరికి కుడిచై కళేల్‌మని యిరుకు పట్టింది. దాంతో అతని బుర్రకి చక్కని సమాధానం తోచింది.

అమెరికాలోని హవాయిలోనో మరెక్కడో ఒక సాంప్రదాయమో ఆచారమో... అండర్‌స్టాండింగ్ (యీ పదానికి సరయిన తెలుగు లేదని అతను మిత్రులతో వాదించేవాడు) లాటిదొ వుంటుందని ఎప్పుడో ఎక్కడో చదివినది గుర్తువచ్చింది. వో పువ్వుగనుక కుడిచెవి భగంలో పెట్టుకుంటే —ఆ ఆడవారు ప్రియునికోసం వేచివున్నట్టు.. పువ్వు ఎడమ చెవిలో పెట్టుకుని వుంటే మాకు ప్రియుడు వుండనే వున్నాడు అన్నట్టు అర్థం వస్తుందని చదివాడు. ఆ థియరీ యీ జాకట్టులకు ప్రవేశపెట్టి చూశాడు. వూహ సరిపోయినట్టనిపించింది.

వెనక గుండీలున్న జాకట్టు తొడుక్కుంటే 'మాకు పెళ్ళి అవబోతోందనో, అయ్యిందనో లేక ప్రియుడున్నాడనో వూహించుకోవాలని, ఎవరికివారు వెనుకనున్న గుండీలు పెట్టుకోలేరని, ఈరకమైన జాకట్టు తొడుక్కోడం వల్ల తమ భావిజీవితం నిర్ణయమయినట్టు ఎదుటివారికి నోటితో చెప్ప వలసిన పనిలేకుండా సునిశితంగా అర్థం అవుతుందనీ అతను తన బృందానికి నివేదించాడు.

'హవురా' అన్నారు మిత్రులు ముక్తకంఠంతో.

వోనెల వారలో తనవూహ తప్పని గ్రహించి, కొయ్యబారిపోయాడు. వేసంగి సెలవులకు చిన్నన్నగారింటికి వెళ్ళినప్పుడు పక్కింటి లావుపాటి అమ్మాయి వెనకగుండీలు తన సొంతచేతులతో అతిసునాయాసంగా పెట్టుకోడం స్వయంగాచూశాడు. చేతులు వెనక్కు అంతలా వొంగుతాయని అతనెన్నడూ అనుకోలేదు. ముద్దబంతి పూవులాటి ఆపిల్లగుండీలను పెట్టుకోడం చూస్తే, గమ్మున వెళ్ళిసహాయం చేదామనిపించింది. మగ పుట్టుక పుట్టినందుకు ఆమాత్రం సహాయం చైకపోవడం అవమానమనిపించింది. అలా గుండీలు పెట్టుకుంటున్న ఆపిల్ల తనని చూసి, సిగ్గుపడి, గంభీరంగానవ్వి, వోణి ఎగసందోసుకుంటూ వెళ్ళిపోడం చూసి నీరుకారిపోయాడు. అసాయంత్రమే ఒక స్త్రీ అలా సిగ్గుపడి, గంభీరంగా నవ్వి, వోణీ సరిచేసుకుని వెళ్ళిపోవడానికి అర్థంఏమిటి అని తర్కించి, వితర్కించి,వివ



# భూపేల గుండ్రం

రికి అది ప్రేమ అని తేల్చుకున్నాడు.

'ప్రేమ' అని మురిసి పోయాడు.

'ఐ. సీ.' అనుకున్నాడు చుట్టూ చూసి.

మూడు రోజులు ఆమెను వెళ్ళి వచ్చి పార్కు చూపి, ఆమె తనకేసి ఆదోలా చూసినప్పుడల్లా కనిపెట్టి నాలుగోనాడు నీళ్ళ బావిదగ్గర, 'సుధ నిన్ను నేను ప్రేమించాను. పెళ్ళికూడా చేసుకుంటాను. య్యాస్ ఐవిల్' అన్నాడు. మాటికి ముక్కుమాటిగా వ్యాపారసరళిలో. (మాటలకు బలముండాలంటే చివర ఇంగ్లీషు పదాలు జోడించాలి అతని నమ్మకం) సుధ గులకరాళ్ళమీద పారిన గంగ(గంగానదికాదు) లా నవ్వింది. 'ఏడిసినట్టుంది' అంది. జారిపడినట్టు మరోసారి నవ్వింది.

'ఏం? వై' అన్నాడతను.

'ఏవేవుంది? పోయి, పోయినిన్నా పెళ్ళిచేసుకునేది? ప్చ్—నీకు ప్రేమించడం రాకపోతే పీడాపోయింది, కనీసం ప్రేమించినట్టు నటించడం కూడారాదు. ఆడదాని మనస్సంటే అంత తేలికగా దొరికేవస్తువా? లోకేశ్వర్రావ్ నీకు లోకజ్ఞానం లేదు' అనినవ్వేసింది.

తనసలా చులకన చెయ్యడానికి చిన్ననాటి నుంచీ తనతో ఆమెకి వున్న చనువే కారణం అని నచ్చచెప్పుకున్నా, తనకు ప్రేమించడం చాతకాదని అన్న ముక్కకు డీలా పడిపోయాడు.

ఆ రాత్రి ఏకధాటిగా ఏవేవో శాపనార్థాలు పెడుతున్న చిన్నాన్న తనని చూసి, ధాటీ తనవేపు తిప్పేవరకూ అవి తనకు చెందిన తిట్లని అతను గ్రహించ లేదు. 'ఛీ..... మనింటా వంటా లేని లాటి బుద్ధులు. ఛీ— ఛీ— ఛీఛీఛ్ఛి ఛీ ఛిఛిఛీఛ్ఛి' అనరిచాడు ఆయన. చిన్నాన్న తిట్లు అర్థంఅయినా, అసలీ విషయం ఆయన కెలా తెలిసిందో మాత్రం అతనికి తెలలేదు.

అదే వేసంగులకు మేనమామ యింటికి వెళ్ళేసరికి ఆయన ఆల్ఫ్రెడ్ హిచ్కాక్‌లా చూస్తూ 'ఏం: చాలా పెద్దవాడివయి పోయావట్నే, మీ నాన్న సంపాదించి దాచుకున్న గౌరవాన్ని టోకున తగలెయ్యడానికి పూనుకున్నావా ఏం?' అనేశాడు. తలతీసి జేబులో దాచుకుంటే బాగున్నన్నంత సిగ్గేసింది లోకేశ్వర్రావుకి. కానీ, కుదరక వూరుకున్నాడు.

ఆ రోజు సాయంత్రం పబ్లిక్ పార్కుకి వెళ్ళి చిన్నతనంలో స్కూలు రోజుల్లో తనని ఏడిపించిన ఫజులున్నిసాబీగాన్ని, కాలేజీలో తనని అందరి ఎదుటా 'ఫూల్' అని, ప్రిన్సిపాల్ వరకూ వెళ్ళే గొడవ చేసిన సుబ్బులక్ష్మిని, లోకజ్ఞానం లేదన్న సుధామయినీ కసితీరా తిట్టి, ఇంటికి వచ్చి, డాబామీద కూర్చుని తరువాయి కానిచ్చి, తన తెలివిని విశదీకరించుకుంటుండగా 'ఏమిటి బావా: తీవ్రంగా ఆలోచిస్తున్నావ్. ఆ సుధామయి విషయమేనా' అంటూ ఉమ మేడమీదికి వచ్చింది.

లోకేశ్వర్రావు వులిక్కిపడి, కప్పిపుచ్చుకుంటూ, 'ప్చ్... లేదు ఐ మీన్.... నీ గురించే యుసీ'

ఇంపాజిబుల్
ఇంపాజిబుల్ ఇంపాజిబుల్!!

అన్నాడు. ఉమ కిలకిలా నవ్వింది.

లోకేశ్వర్రావు ఉమకేసి చూశాడు.

తలంటి పోసుకున్న చిక్కు విరగబోసుకుంటూ డాబా పిట్టగోడకు పొట్ట ఆనించి, దూరాన్నుంచి వినిపిస్తున్న పాటకు లయగా కుడికాలు వూపుతోంది.

లోకేశ్వర్రావు హృదయం భగ్గుమని పిడికెడు బూడిదయ్యింది. మనస్సు ఎవోగ్రఫ్ మీదుంచి తెనాలి రామకృష్ణుని నీడ ప్రాకింది. మనాయనకి పద్యం గుర్తురాక, బుట్ట పిక్కుతున్నాడు. ఆడవాళ్ళ అందం ఎన్నివిధాలో అతనికి అంతు చిక్కలేదు.

సన్నని నున్నటి మెడ, శంఖాసింటి పిడి, గుండ్రని భుజాలు, వెడల్పాటి వీపు, చక్కని సన్నని అతి నాజూకైన నడుము......

బ్రతో నే బ్రతకజాలను అనుకున్నాడు. హృదయం మెగ్నీషియం తీగలా భగ్గున బూడిదయ్యింది.

ఉమని తన గుండెకు హత్తుకోవాలని, అతి సుకుమారంగా ముద్దు పెట్టుకోవాలని సించింది. 'హో ఉమా..... నీవు నా దానవే సుమా' అనుకున్నాడు. నిట్టూర్పు శబ్దం ఎంత కొంచెం చిక్కలేదు, ఉమ వెనక్కి తిరిగి, 'ఏం బావా, పూరా ప్రపంచంలో మునిగి వుడిపోడు. భోజనానికి వేళయ్యింది' అని నవ్వేసి వెళ్ళిపోయింది.

లోకేశ్వర్రావు హో నేను గెలిచేవరకూ బుర్ర గోక్కున్నాడు. కోపంకొద్దీ ఆ పేనుని నలుక్కు చంపేసి మేడ దిగాడు. ఆ రాత్రి ఉమ అతని కలలో డ్యాన్సు చేసింది. వయనాస్మరా, సుందరా, సుమదా, అనటాని పాడింది. చేయి సాచి పిలుపు బిగుపెలరా, రారా, సన్నెలరా, వీరా, అని పిల్చింది. నిద్ర మెలకువ వచ్చి చుట్టూ చూసి, తన మంచం క్రింద పడుకున్న వూర కుక్కని హో అని తన్నాడు. కళ్ళు మూసుకుని, కల కంటిన్యూ (దానికి తెలుగు పదం లేదని అతని వాదన.) అవ్వాలని కోరుకున్నాడు.

నిద్రలో అర్ధరాత్రి అస్పష్టంగా పలుకుతున్న ఉమతో,

దగ్గు, జలుబులు నీర్సమును కలిగిస్తాయి — యితర వ్యాధులకు దారితీస్తాయి

# బలము మరియు ఆరోగ్యమునకు వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి




దగ్గు, జలుబులతో రోగ నిరోధక శక్తిని కోల్పోతారు. మీరు నీర్సముగా వుంటారు. అటువంటప్పుడు మీకు యితర వ్యాధులు సోకే అవకాశ ముంటుంది. గనుక వాటర్‌బరీస్ కాంపౌండ్ క్రమంగా త్రాగండి. దీనిలోగల ఓషధులు ఆకలిని వృద్ధి పరుస్తాయి. కోల్పోయిన శక్తిని తిరిగి చేకూరుస్తాయి. యితర వ్యాధులు కలగకుండా రోగ నిరోధక శక్తి నిస్తాయి. దీనిలో చేర్చబడిన 'క్రియోసోట్' మరియు 'గయాకోల్' దగ్గు, జలుబులనుండి ఉపశమనము కలిగిస్తాయి.

**వాటర్‌బరీస్ కాంపౌండ్ – అత్యంత నమ్మకమైన టానిక్**

వార్నర్-హిందుస్థాన్ లిమిటెడ్

WH 3071




గబ్బిలం గురించి తెలుసుకోబోయే ముందు అది—తల్లక్రిందుల పక్షి అని మనం పిలిచినా—నిజానికి పక్షి కాదని మనలాగే స్తన్యజీవి అని గ్రహించాలి. అది మనలాగే పిల్లల్ని కని పాలిచ్చి పెంచుతుంది ఒకే ఒక జత అంగాలు, మనకు చేతులుగా మారితే దానికి రెక్కలుగా మారాయి. నాలుగువ్రేళ్ళు—బొటనవ్రేలు మినహా మిగతావి—సన్నగా పొడవుగా గొడుగు ఊచలకు మల్లే అయిపోయాయి. దానికి అతికి చర్మం పొర ఏర్పరిచింది. రెక్క తయారయింది. మనకు రెక్కలు రావాలని కలల్లోను; కథల్లోను ఊహించినట్టుగా అయింది. అయితే దీనికి కొన్ని కోట్ల సంవత్సరాల పరిణామ కాలం పట్టింది.

వెనక జతకాళ్ళు పక్షికిలాగా కూడా ఉండవు. వాటిమీద నిలబడలేదు. అందుకని కొమ్మలకు, గోడలకి రాళ్ళకు పట్టి తలక్రిందులుగా వ్రేలాడుతుంది.

గబ్బిలాల్లో కొన్ని పెద్దవి. సాధారణంగా ఇవి పళ్ళమీద ఆధారపడి ఉంటాయి. సాయంకాలం పోయి, రాత్రి పూట తిని, ఉదయాన్నే తిరిగివచ్చి విశ్రాంతి తీసికొంటాయి. చిన్న గబ్బిలాలు మరికొన్ని జాతులున్నాయి. ఇవి పురుగుల్ని పట్టి తింటాయి. పగలంతా గుంపుల్లో చెట్లకు అతుక్కుంటాయి. సాయంకాలం పురుగులు ఎగిరేసమయంలో సునాయాసంగా నేర్పుగా పట్టుకొంటాయి. దక్షిణమెరికాలో కొన్ని ఘోరమైన గబ్బిలాలు ఉన్నాయి. వీటిని 'వ్యాంపైర్' గబ్బిలాలు అంటారు. వీటి ఆహారం జంతువుల ఉడుకు రక్తం. కోళ్ళు, గుర్రాలు, పశువులు మాత్రమేకాక మనుషుల రక్తాలుకూడా తాగుతాయి. శరీరానికి తన దంతాలతో గాటు పెట్టి 'బొటబొట'కారే రక్తాన్ని పీల్చేసుకొంటుంది.

కోళ్ళపింఛాల్ని కోస్తే; అతి సున్నితమైన భాగంకాబట్టి రక్తం బాగా స్రావం అవుతుంది. మనిషి పాదాల చర్మాన్ని అడ్డంగా కోస్తుంది. ఈ కోత తక్కువనొప్పిని కలిగించడమేకాక ఎక్కువ రక్తనాళాల్ని కోస్తుంది. పడక బట్టలు రక్తంతో తడవడం గమనించగలం గాని, కోతబాధ తెలియదు. రక్తం నిలవకి లోపల సచిం కూడా ఉంచి. నీళ్ళనంత నిలవ చేసుకొంటుంది. మళ్ళీ ఎప్పుడో అవకాశం!

అన్నిటికన్న ముఖ్యమైన విషయం ఒకటి ఉంది. గబ్బిలాలు చీకట్లో, గుహల్లో 'దారీ తెన్నూ తెలియని పరిసరాల్లో' అతిసునాయాసంగా ఎగురుతాయి. చీకట్లో ఎగురుతూ గోడకు గుద్దుకోకుండా వెనక్కి తిరిగిపోవడం గమనించే ఉంటాం. గబ్బిలాలకి 'రాడార్' నిర్మాణం ఉంది. అది కొన్ని వబ్దాలను, మన చెవికికూడా

(VIII వ పేజీ చూడండి)

# భూవే గుండ్రం

జడవేసుకుంటున్న ఉమను, వేసేసుకున్న ఉమను అనేక రకరకాల ఉమలను యిష్టం వచ్చినట్టు చూశాడు.

తెల్లటి ఉరిపిరి బట్టలు తొడుక్కుని గాలిలో ఎలుగెత్తి నా రాజా... హో హో నా రాణి..అని పాడినట్టు కలగన్నాడు.

వులిక్కిపడి లేచాడు.

ఏవిటా గావుకేకలోరీ అని మామయ్య మందలించేసరికి లేచి కూర్చుని, బాగా తెల్లవారినవైనం పసిగట్టాడు. భోజనాలు వేళకల్లా ఉమని తను పెళ్ళి చేసుకుని తీరాలని తెగ నిశ్చయించుకుని, ఉమని నాకిచ్చి పెళ్ళిచెయ్యరా..అని మేనమామని అడగబోయి క్రింది పెదివి కొరుక్కున్నాడు.

ప్రాణం జలార్చుకుపోయింది.

ఏవిటలా అవుతున్నావ్ అని అత్తయ్య మందలించేసరికి 'ఎబ్బె.. ఎబ్బెబ్బె ఏంలేదు' అన్నాడు.



స్త్రీలకు పురుషుల మీద రెట్టింపు జీర్ణశక్తి, నాలుగు రెట్లు తెలివితేటలు, ఆరు రెట్లు సాహసము, ఎనిమిది రెట్లు కామము వుంటుందని తనెక్కడో చదివిన తాత్పర్యం గుర్తు తెచ్చుకుని, ఆ శాస్త్ర రీత్యా ఉమ తనని ఎనిమిది రెట్లు ఎక్కువగా ప్రేమిస్తూ వుండి వుండాలని నిర్ణయించుకున్నారు.

తన మనస్సులోకి మరో విషయం చూడి వీల్లేకుండా చెయ్యడానికి అడ్డమైన యింగ్లీషు సినిమాలు ఏకథటిన చూడసాగాడు. మరోనాడు రెండో ఆట సినిమాకి వెళ్ళి ఆ రద్దీకి అబ్బురపడి, ఇండియాలో దారిద్ర్యంలా వ్యాపించిన బ్లాక్ మార్కెట్టు సహాయంతో పరుగెట్టుకువెళ్ళి సీటులో కూర్చున్నాడు.

హాల్లో స్థిరపడి, వాస్తవంలోకి వచ్చి, వెండి తెర మీద వంపులు చూపిస్తూ కొంచెం తెరచిన విసినకర్ర వాడిస్తున్న యువతికి కేవలం వంటి మీద

టట్టు లేనేలేదని నిశ్చయించుకుని, సరదాకి పక్క వాడితో హో పావలా పందెం కడదామని, పక్కకి చూడబోయి, ముందుకు చూసి అట్టే వుండి పోయాడు కంచు విగ్రహంలా.

ఎదురు వరసలో కూర్చున్న అమ్మాయి ఉమలా వుండి, చూస్తుండగా ఉమే అయిపోయింది. ఉమ పక్కన తన బదులు మరో పరపురుషుడు వుండటం చూసి, కెవ్వున కేక వేయబోయి, నిభాయించుకున్నాడు లోకేశ్వరరావు.

కోపంతో 'రాస్కెల్' అని గొణిగాడు.

'వాట్' అనరిచాడు పక్కనాయన.

'ఎబ్సొ..ఐవిగాన్..యుసి..వాట్సె బెల్యాయిూజ్ మిన్..యుటీజెబగ్..హో..ఎబగ్' అన్నాడు. అవతల అను పూర్తిగానే వినలేదు యీ వ్యాఖ్య. లోకేశ్వరరావు ముడుచుకుని కూర్చున్నాడు.

ఇంటర్వెల్‌లో అతన్ని చూసిన ఉమ 'బావా' అని పిలిచి, ఆ పక్క శాల్తీని చూపించి, 'ఇతను ఇతనే మా బావ' అని చెప్పి 'ఇతను గౌసు రబ్బాని' అంది క్లుప్తంగా. గౌసురబ్బానీ నవ్వాడు.

వాటీఫ్ అందా మనుకుని మానేశాడు.

ఉమ కళ్ళు నవ్వాయి.

సినిమా అయ్యాక గౌసు రబ్బానికి టాటా చెప్పి, దారిలో లోకేశ్వరరావుకి గౌసురబ్బాని గురించి ముత్యం మూడు మాటలు చెప్పి 'ఐ లైక్హిమ్' అంది క్లుప్తంగా.

'ఐసీ' అనుకున్నాడు లోకేశ్వరరావు.

'అమ్మా నాన్నా వప్పుకోరనుకో. బట్ సోవాట్? ఇలాటి వాటిలో సలహా తీసుకోకూడదనుకో. ఏమంటావ్?' అంది.

'నా సలహా అదే— యూసీ— ఎవరి సలహా తీసుకోకూడదు' అన్నాడతను.

మూడోనాడు మెయిలెక్కుతూ కూడా అదే ముక్క అన్నాడు. మెయిలెక్కి స్వగృహానికి చేరిన రెండు నెలలకు తల్లి లోకేశ్వరరావుని పిలిచి, 'ఒరే లోకం, విన్నావా పాపం! ఉమ ఎవరో సాయిబుతో లేచి పోయిందట' అంది. లోకేశ్వరరావు రామాయణం విన్నంత హాయిగా విని 'నేననుకుంటూనే వున్నాను' అన్నాడు.

అతని తల్లి ఆశ్చర్యపడి, 'ఏమిట్రా నువ్వు అనేది!' అంది. లోకేశ్వరరావు తబ్బిబ్బయి, సర్దుకుని, 'ఏవిటి ఏమంటావు.. నే వినలేదు. ఏనిటో ఆలోచిస్తున్నాను. ఏమిటి ఉమ లేచిపోయిందా? ఛ ఎవరన్నారు? తప్పయి వుంటుంది. ఉమలాటిది కాదు' అన్నాడు బుకాయింపుగా.

అతని తల్లి బుర్ర సున్నితంగా బాదుకుంది.

'నువ్వో మాలోకంరా. ఇదిగో మీ మామయ్య రాశాడు పాపం!!' అంటూ కవరు అతని ఒళ్ళో పడేసి, వెళ్ళిపోయింది.

కవరు చూసి, తెలుసుకోవలసిన దేమి లేదని గ్రహించిన లోకేశ్వరరావు ఎందుకైనా మంచిదని చదివి, నిట్టూర్చాడు.

తనకు ఏమీ తెలీదని, తనుత్త మాలోకం అనీ మొదటిసారిగా అతనికి మనస్సులో నమ్మకం ఏర్పడింది. ●

# వారఫలం

## 12-9-1969 శుక్రవారం మొదలు 18-9-1969 గురువారం వరకు

**మేషం:** వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవికార్యాలు నెరవేరుతాయి.

**వృషభం:** వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. పోటీవారితో మాట పట్టింపులు తగవు. వృత్తిలో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది

**మిధునం:** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలక.— సంతానానికి సౌఖ్యసంతోషాల. లభిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కర్కాటకం:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలుబాగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. బంధువులకు సహాయం చేయగలరు.

**సింహం** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు.

స్త్రీలకు— బంధుమిత్రులను కల్సుకొంటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**తుల:** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. ప్రయాణాలు చేస్తారు.

**వృశ్చికం:** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో వ్యాపారంలో అనుకూలత లభిస్తుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**ధనుస్సు:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:** వృత్తివ్యాపారాల్లో అనుకూలత లభిస్తుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. బంధువులకు సహాయం చేస్తారు.

**కుంభం:** అన్ని వ్యవహారాల్లోను ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది.

**మీనం:** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం మధ్యలో వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్

# పరివేష్టం

సీరియల్

శిఖా వెంకటరమణ



ArS Murty

### జరిగిన కథ

జయ మేనమామ కొడుకు కాళిదాసు. చదువుల కోసం మద్రాసుకి వస్తారు. అక్కడ జయకి సాంబు కనిపిస్తాడు. సాంబు జయని గుర్తు పడతాడుగాని, జయ సాంబుని ఎరగనంటుంది. సాంబు కాళిదాసుతో తన కథ చెబుతాడు. రాజశేఖరం జయని పెళ్లి చేసుకోమని కాళిదాసుని అడుగుతాడు. భారతికి అన్యాయం చెయ్యడం అతనికి ఇష్టంలేదు. జయ సాంబుని గుర్తుపట్టినట్టు చెబుతుంది. మార్గరెట్ సాంబుని ప్రేమించిన వ్యక్తి. ఆమెకి జయ అంటే గిట్టదు. మార్గరెట్ సాంబుచేత తిరస్కరింపబడి స్వదేశానికి వెళ్లిపోతుంది.

## 6

దీపాలవేళ దాటిపోయినా జయ రాలేదు. సాంబశివంగురించి యే ఒక్కరికీ తెలియదు. జయే స్వయంగా అన్నది చాలా సార్లు. 'సంఘాన్ని యెదిరించి మనం బ్రతకలేం. నేను ఆత్మస్థైర్యం లేనిదాన్ని. నీకన్నా పిరికిదాన్ని కాళిదాసూ. అందుకే నాకు పెద్ద కోరికలులేవు బ్రతుకు విషయంలో. దొరికిన జీవితాన్ని తృప్తిగా అనుభవించడమే నా పాలిసీ. ఆశలు పెంచుకోవడం, తీరకపోతే యేడుస్తూ కూర్చోవడం యివన్నీ చాలా బోర్సమ్ థింగ్స్.'

చేతిలో హేండ్‌బాగ్‌ని వూపుకుంటూ లోపలికి వస్తున్న జయనిచూసి కాళిదాసు ఆలోచనలు తెంచుకున్నాడు. 'యేం బావా భారతి రాలేదూ' అన్నది లోపలికి అడుగు పెట్టబోతూ.

కాళిదాసు తెప్పరిల్లి 'అబ్బే భారతి కోసంకాదు జయా! నీ కోసమే' అన్నాడు.

'యేం పనేమైనావున్నదా'

'యేమీలేదు. చీకటైపోతే...రోజులంత బాగలేవు. యింత ఆలస్యంగా వచ్చేవేం జయా. నీ కోసం యిందాకటి నుంచీ యెదురు చూస్తున్నాం నేనూ భారతీ.'

జయ నవ్వింది: 'భలేవాడివి నేనేం పాపాయినా తప్పిపోయేందుకు. యిన్నేళ్లనుంచి యీ వూళ్లో వుంటున్నాం. నాకేం ప్రమాదం జరగదులే'

'అది కాదు జయా! కాళిదాసు యిబ్బందిగా అన్నాడు:' మామయ్య నిన్ను నాకు అప్పగించేక ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయి. నువ్వు ఆలస్యంగావస్తే... చూడు జయా! నువ్వు అన్యథా భావించక పోతే ఒక్కమాట.'

జయ ఆగి అతనివెనకేవెళ్లి నిలబడింది అతను చెప్పేవిషయాన్ని ఆసక్తిగా వింటూ.

'మన సొసైటీ యింకా యెదగలేదు. ఆడామగా కలిసి షికార్లుచేస్తే గర్హించేందుకు. నువ్వు యెవరితోనో మాట్నీకి వెళ్లావని అంటూంటే నేను యేమి సమాధానం యివ్వాలో అర్థంకాని వాడిలా విలబడి పోయేను'

'హుఁ' జయ చిత్రంగా నవ్వింది:' 'నాగురించి బయటవాళ్లు చెప్పేది నువ్వు నమ్మేవా బావా! నామీద నీకు నమ్మకం లేదని ఒక్కసారి చెప్పు'

'చూడు జయా!' నమ్మకాపనమ్మకాలు వ్యక్తి పరిచయాన్నిబట్టి వుంటాయి. నేను ఆమాట అనగలనోలేనో నువ్వు తెలుసుకోవాలి. కాకపోతే నలుగురూ యెందుకిలా అంటున్నారో ఒక్క సెకెండు ఆగి, ఆలోచించాల్సి వస్తుంది. కారణం నువ్వు ఆడపిల్లవి కనుక. స్నేహం చేయకూడదని యెవరూ అనరు. అన్నిటికీ కొన్ని హద్దులుంటాయి. వాటిని మనం అతిక్రమిస్తే ప్రపంచం నవ్విపోతుంది. లోకం చెవులు తూట్లుపడేలా ఘోష పెడుతుంది.'

జయ అతనివైపు అయోమయంగా చూసింది: 'నువ్వేవిటి బావా యిలా మాట్లాడుతున్నావు. నే నెలాంటి దాన్నో నీకు తెలియదూ'

కాళిదాసు చిన్నగా నవ్వేడు. అతని నవ్వులో యెంతో వోదార్పు కనిపిస్తోంది. 'నువ్వెలాంటిదానివో నాకుతెలియదుటోయ్' అంటున్నట్టుంది. జయమీద నమ్మకాన్ని సువర్ణాక్షరాలతో అతను పెదాలమీద పలికిస్తున్నాడా అనిపిస్తోంది.

'మనం అలా గార్డెన్‌లో కూర్చుని మాట్లాడుకుందాం వస్తావా!

[illegible]

పోయింది. చుట్టూ చీకట్లు దట్టంగా వ్యాపించేయి. పక్కనేవున్న స్ట్రీట్‌లైట్ కాంతిమాత్రం వాళ్ళిద్దరూ కూర్చున్న తిన్నెమీదికి ప్రసరిస్తోంది. యిద్దరి మధ్య ఐదారు నిమిషాలు నిశ్శబ్దం తాండవించింది. వంటయింట్లో భారతి గిన్నెల తోటీ, గరిటలతోటీచేసే కుస్తీ అప్పుడప్పుడు వినిపిస్తోంది.

'ఈ విషయం చెప్పుజయా! నిన్ను నేను యేమీ అనను. నువ్వు పదిరోజుల క్రితం రాత్రి పన్నెండుగంటలు దాటాక వాక్కర్తీ సాంబశివం గదికి వెళ్ళేవుట'

'బావా!' అదిరిపడింది జయ: నువ్వేనా యీమాట అంటున్నది' నే నలాంటిదాన్ని కాదని తెలుసునని యెందుకీమాటకి యింత ప్రాముఖ్యతని యిస్తున్నావు? భగవంతుడి సాక్షిగా ...' జయ మాటలు మింగేసింది. [illegible] ...టే కొంగు

మొహంలోకి వెర్రిదానిలా చూసింది జయ...కాళిదాసు మనసుకరిగి నీళ్ళై కళ్ళగుండా ప్రవహింప జేస్తోంది. చిన్నప్పుడు బుగ్గలు కందిపోతూంటే వెక్కివెక్కి సాంబశివంకోసం యేడుస్తున్న జయని దగ్గరకి తీసుకుని లాలనగా భుజంమీద చేయి వేసేవాడు. ఆ పిల్ల అంతదుఃఖంలోనూ 'సాంబశివం చాలా మంచివాడు. మళ్ళీ కనిపిస్తాడుకదూ,' అనేది.

అందుకు కాళిదాసు 'అవును. మరి నువ్వు యేడుస్తేమాత్రం యెప్పుడూ కనిపించడు' అనేవాడు.

అటువంటిది యిప్పుడు యీ వయసు వచ్చేక అంత యెదిగిన జయమీద నేరారోపణ చేయలేక పోయేడు. అయినా తప్పదు. నలుగురూ చేరి అతన్ని నిలవనీయడం లేదు. ఈ మాటల ఈటెలతో అతన్ని తూట్లు చేస్తున్నా[illegible]

[illegible] భవిష్యత్‌కోసం అతను అడగకుండా వుండలేకపోయేడు. జయ భగవంతుడి మీదే ఒట్టుపెట్టి పసిపిల్లలా బావురుమనగానే ఆ పిల్లకి దగ్గరగా జరిగి, ఆ చిన్నతనంలో మాదిరిగానే భుజంచుట్టూ చేతులువేసి 'లేదు జయా! నన్ను క్షమించు. ఈమాట నేను అనలేదు' అన్నాడు.

జయ లోపలికి వెళ్ళిపోయింది. భారతి బతిమిలాడినా భోజనం చేసేందుకు నిరాకరించింది.

'నువ్వు భోజనం మానేస్తే మేమూ చెయ్యం,' అన్నది భారతి గిన్నెలన్నిటిమీదా మూతలువేసి సర్దేస్తూ.

'నువ్వు చెప్పు భారతీ! నేను సాంబశివం గదికి అర్ధరాత్రి వెళ్ళేంత సాహసం వున్నదాన్నే. యెవరో యేదో అన్నారని



[illegible] యిన్నాం వాళ్ళవ రోజున నాన్నతో చెప్పి పెళ్ళికి వొప్పించలేక పోయేదాన్నం టావా,' అన్నది. జయ కళ్ళవెంబడి నీళ్ళు ధారగా కారుతున్నాయి.

కాళిదాసు గదిగుమ్మం దగ్గర నిలుచుని విన్నాడు. అతను భారతివైపు తిరిగి 'మన జయ యిలాంటిదని నేనెప్పుడైనా అన్నానా నువ్వు చెప్పు భారతీ. యిద్దరం ఒక కంచంలో తిని పెరిగిన వాళ్ళం. దాని మనసు నేనెంత యెరిగివుండాలి యిన్నాళ్ళ స్నేహంలో ఒక్కసారి ఆలోచించు' అన్నాడు.

అతనే వంటయింట్లోకి వచ్చి టేబిల్ సర్దేసి కంచాలువేసి జయ చేతిని అందుకుని 'రా తల్లీ!', అన్నాడు. భారతి జయ వైపు చూసి 'చూడు జయా! నువ్వంటే మాకెంతో అభిమానం అనేసంగతి ఎప్పు డైనా ఆలోచించేవా? యిది నువ్వు పెట్టిన భిక్ష, నీపట్ల కృతఘ్నులం అయి ప్రవర్తించలేం. ఈ సంగతి యిక్కడితో పోతే ఫరవాలేదు. యిదే మీ నాన్నగారికి తెలుస్తే యేమనుకుంటారు? మన ముగ్గురిమధ్యా రహస్యాలు వుండ కూడదనే నా వుద్దేశ్యం. సాంబశివాన్ని నువ్వు పెళ్ళి చేసుకోవాలనుకుంటు న్నావా?', అన్నది.

జయ తలెత్తింది: 'ఈ విషయం చాలా రోజుల్నించే చెప్పాలను కున్నాను. వీలుపడ లేదు. ఫైనలియర్ వరకూ ఈ విషయాన్ని దాచిపెట్టాలనుకున్నాను. చదువూ— పెళ్ళి రెండింట్లో ఒకటే...ప్రస్తుతం. అతనితో అదే అన్నాను.'

'ఈ విషయం యిప్పుడు మావయ్యకి రాయడం యెంతో శ్రేయస్కరం. యెలా గైనా ఒప్పించి త్వరగా చేసే యాలి ఈ పెళ్ళి', కాళిదాసు అన్నాడు.

జయ అతనివైపు ఒక్కసారి చూసింది. వద్దని వారించనూలేదు. కావాలనే సంతో షాన్ని బయట పెట్టనూలేదు.

రెండుమూడు రోజులు గడిచి పోయేయి. జయ నిర్లిప్తంగా వుంటోంది. సాంబ శివాన్ని యే విషయమూ అడగలేదు. తమని గురించి అంతటా తలో విధంగా అనుకుం టున్నారని తెలుసుకోలేదు. అతను రమ్మన్న చోటికి వెళ్ళటం, చెప్పినట్లు చేయడం [illegible] [illegible] [illegible]. [illegible]

కూర్చున్నా, నిలుచున్నా మెదడంతా శూన్యంగా వుండి యాంత్రికంగా చేస్తు న్నట్లున్నది యీ పనులన్నిటినీ. బజారులో సగందూరంపైగా వచ్చేక 'యిదేమిటి సాంబూ! యిలా వచ్చేశాను'. అనాలను కుంటుంది. సాంబశివం పిచ్చిదాన్కింద లెక్క కట్టేస్తాడేమోననే భయంతో పెదాల్ని కదపనివ్వదు.

బీచ్‌వైపు బయలుదేరే మనిషి మధ్యలో ఆ ప్రయత్నాన్ని విరమించుకుని యే మార్కెట్టుకో, కోవెలవైపో సాగిపోతుంది. జయ మెదడుని యేదో శక్తి ఆవరించింది. అది చెప్పేట్టు జయ చేస్తోంది కానీ జయ మనసుతో నిమిత్తం లేకుండా పోతోంది. 'పద' అంటే కదిలి వెళ్ళిపోయే కీలు బొమ్మలా మారి పోయింది.

ఆ రోజు కాలేజీనుంచి చాలా త్వరగా వచ్చేసింది జయ. మామూలు ప్రకారం అప్పటికే ముందుగా యిల్లు చేరుకున్న కాళిదాసు కాఫీ కాచుతున్నాడు వంట యింట్లో. జయ రెండు చేతుల్తో తల పట్టుకుని వంటయింట్లోకి చేరుకుని అతని యెదురుగా పీటవేసుకుని కూలబడి పోయింది.

'యేం జయా అలా వున్నావు? భారతి రాలేదూ? అసలేం జరిగింది? తలనొప్పా,' హడావుడిగా ప్రశ్నల వర్షం కురిపించేడు.

జయ అతని కళ్ళల్లోకి చూసింది. అప్పటికే ఆ పిల్ల యేడుపుకి సిద్ధంగా వున్నదని గ్రహించేడు కాళిదాసు.

'బావా! నాకెందుకో భయంగా వుంది; కొంపతీసి నన్ను మీరందరూ కలిసి పిచ్చాసుపత్రిలో పడేయరు కద?'

'నీకేం పిచ్చా! నీకిప్పుడేమైందనీ. చెప్పు జయా, యెందుకిలా మాట్లాడు తున్నావు?'

'మరేమీలేదు బావా! జస్ట్ అలా అనిపించిందంతే, నాకేమీ కాలేదు యిప్పుడు' అన్నది పీటమీదనించి లేస్తూ.

కాళిదాసు మరదలివైపు చిత్రంగా చూశాడు. ఆతరువాత జయ యెన్నడూ ఆవిధంగా కాలేజీనుంచి త్వరగా వచ్చేయడం కానీ, యెక్కువగా మాట్లాడడంగానీ చేయలేదు.

రెండేళ్ళు చాలా చురుకుగా గడిచి పోయేయి. భారతీ జయా స్వంత అప్ప చెల్లెళ్ళకన్నా యెక్కువగా అయిపోయేరు. కాళిదాసు గతంలో రెండుమూడుసార్లు జయనిగురించి మేనమామని వొప్పించాలని చూశాడు కానీ జయ గాంభీర్యాన్నీ, ఒక విధమైన వుదాసీనతని చూశాక కొంచెం భయపడ్డాడు. ఆ విషయాన్ని కదిలిం చేందుకి మొహమాట పడ్డాడు. తెగించి సాంబశివాన్ని కూడా అడగలేక పోయేడు. ఉన్నట్టుండి జయ మూగదానిలా అయి పోగానే గతాన్ని గతంలోనే వుంచేశారు. 'సాంబశివం యింటికి అర్ధరాత్రి వెళ్ళిం దనే విషయాన్ని' అన్న వ్యక్తులు. సాంబ శివం హౌస్‌సర్జన్ పూర్తిచేసి మెడ్రాసు లోనే తెలిసిన డాక్టరు దగ్గర ప్రాక్టీసు చేస్తున్నాడు. ఆయన రాఘవరావుగారు. గిరిధర్‌కి ప్రాణమిత్రులలో ఒకరు.

కాళిదాసు భార్య చదువూ జయ చదువూ పూర్తి ఆయేవరకూ మెడ్రాసు కదలాలనుకో లేదు. సాంబశివం రాకపోకలు కేవలం జయ కోసమే.

ఆ రోజు చెట్లకి నీళ్ళుపోస్తూ నెమ్మదిగా అడిగింది భారతి: 'రాత్రి ఒక్కదానివీ తోటలో కూర్చున్నావు యెంతో సేపు. నన్ను రమ్మని పిలుస్తే వచ్చేదాన్ని కదా జయా. యేదో ఆలోచిస్తున్నావు. నిన్నెందుకు కుదిపిలేవడం అని కుర్చీలో నీకు యెదురుగా కూర్చుని వుండిపోయేను.'

జయ ఆశ్చర్యంగా చూసింది. కాస్సే పాగి 'భలేదానివే యింకానయం తోటలోనే కూర్చున్నానన్నావు. బీచ్‌వైపు షికారు వెళ్లానన్నావుకాదు' అన్నది.

భారతి ఆశ్చర్యానికి అవధుల్లేవు జయకి దగ్గరగావెళ్ళి చేతిని అందుకుని బెంచికి దగ్గరగా తీసుకువచ్చి అక్కడ కూర్చో బెట్టి 'యిప్పుడుచెప్పు నేను అన్నమాట నిజం అవునో కాదో గుర్తుచేసుకుని' అన్నది.

జయ బిత్తరపోయి చూసింది. కానీ యేమీ మాట్లాడలేదు. యిద్దరి పరీక్షలూ దగ్గర పడుతున్నాయి. కాళిదాసు అప్పుడే బజారులోంచి వచ్చేడు. జయా, భారతి ఒకళ్ళ మొహంలోకి మరొకళ్ళు నిశ్శబ్దంగా చూసుకోవడంచూసి అటుగావచ్చి చిన్నగా దగ్గి 'జయా మనకి ప్రయాణం తగిలిం



శ్రేష్ఠమైన రుచియు
మంచి సువాసనతో నిండిన
పానీయము
ధరయో అతి సరసము
లిప్టన్స్ హిమాలయన్
గోల్డెన్ డస్ట్ టీ

ఎవరయినా కానీయండి, ఒక్కసారి
త్రాగితే చాలు—మళ్లీ మళ్లీ అడుగుతారు,
నిస్సందేహంగా, మీకు మహదానంద
కరమైన తృప్తినిచ్చే చిక్కని, కమ్మని
పానీయం యిది. కప్పు తర్వాత మళ్లీ
కప్పు. త్రాగటం సరికొత్త మధురాను
భూతిని ప్రసాదిస్తుంది. పైగా, యిది
ఎంతో లాభదాయకము.







లిప్టన్స్
అంటే మంచి టీ

# పరిలిప్తం

జయ నిశ్శబ్దంగా నవ్వింది. 'నువ్వేం కొత్త మోసుకువచ్చేవు? యిది జస్టు యీ జోక్ కాదుకదా!' అంటూ.

కాళిదాసు అంతక్రితం జరిగిన విషయం యేదీ ప్రశ్నించలేదు. రాజశేఖరం అతనికి వుత్తరందాశాడు. ఉన్నపళాన బయలుదేరి రమ్మనేతప్ప మరే విశేషంలేదు ఆ వుత్తరంలో.

'నేనుకూడా దేనికి?' అన్నది భారతి.

బాగుంది వరస. నువ్వు లేకపోతే నేనూ వెళ్లను: బావఒక్కడే వెళ్లివస్తాడు' జయ పుస్తకంలో తలదూర్చి వినుగ్గా అన్నది.

కాళిదాసు మనసెందుకో పరిపరి విధాల పోవడం ప్రారంభించింది. ఒకవేళ అదే జరుగుతే జయ తనని తెలిసే నాటకం ఆడేవని నిష్ఠూరం వేయదూ' అతని అంతరాత్మ చిత్రంగా ప్రశ్నవేసింది.

భోజనాలకి కూర్చున్నపుడు అతనే ప్రస్తావన తీసుకునచ్చేడు. 'చూడు భారతి, మన జయ మొహంమీద పెళ్లికళ వచ్చేసింది. మావయ్య ఒకవేళ అందుకుగాని పిలవడం లేదుకద'

భారతినోటికి అందించబోయిన ముద్దని ఆపేసి జయవైపు చూసింది. జయ కంచాన్ని తోసేసి చెయ్యి కడిగేసుకుంది. మూగగా వుండడమో, యిలాంటి చిన్న చిన్న రభసలు చేయడమో రెండేళ్లుగా కాళిదాసు అలవాటు చేసుకున్నాడు. భారతి కాళిదాసువైపు మింగేట్టు చూసింది: 'యిదేం వెటాకోళం. జయ సంగతి మీకు తెలీదా. బాబాయికి వుత్తరం రాయండి. యీ పెళ్లి జయ చేసుకోదనీ. సాంబశివాన్ని ఆయన ఒకవేళ చేసేందుకు యిష్టపడక పోతే మనమేచేస్తాం అనీ. దాన్ని సతా యించడం మీకు తమాషా అయిపోయిం దేమోగానీ నేను యిష్టపడను యిలాంటివి. జయ అందరిలా నోరు పడేసుకునే మనిషి అయితే మీతో సమానంగా నేనూ యేడిపించేవాణ్ణే. పోనీ ఒక్కసారి డాక్టరుకి చూపిస్తే యేమండీ!

కాళిదాసు నవ్వేడు: ఉక్కు గుండులా వుంది. దానికేం భారతీ. నువ్వే దానికి గారాబం మప్పేవు. యిప్పుడు మామయ్యరాసిన వుత్తరంలో సారాంశం అదే అని అడి యెందుకు పమ్మాలి? వాళ్లు తెలిసమ

కున్నారా. జయ మౌనంగా గుండెల్లో గూడు కట్టుకుని సాంబశివాన్నే పూజిస్తోందని'

'యేమో!' భారతి నిస్పృహగా అంది: 'అది వేళకి తిండి తినడంలేదు. సాంబశివాన్ని చూస్తే అతను వచ్చేసి దిగాలుపడి కూర్చుంటున్నాడు. జయమనసు యిలా అయిపోయేందుకు కారణం మరేదైనా వున్నదేమో మీరెందుకు ఆలోచించరు?'

'పిచ్చిభారతీ! అందరూ నీలా డబ్బాలా వాగుతూ ంటే యెలాగోయ్. అదేదో ప్లాన్ వేస్తోంది. సాంబశివానితో నెక్స్టుయియర్ ఫారిన్ వెడుతుందేమో. అదెవరికి తెలుసును?'

జయ యేమీ వింటున్నదానిలా లేదు. శూన్యంలోకి చూస్తూండి పోయింది చాలా సేపు. కాళిదాసు గొల్లున నవ్వుతూంటే వులిక్కిపడి 'అయితే రేపు వెడదాం అంటావు అవునా' అన్నది.

మర్నాడు ప్రయాణం ఆయేముందు సాంబశివాన్ని కలుసుకుంది.

అతను జయచేతిని ఆప్యాయంగా నిమురుతూ 'ఉన్నట్టుండి నువ్విలా మాటలు రాని దానివి అయిపోయేవేం జయా! మీ నాన్న నాకు దూరంగా మరెవరికైనా యిచ్చి వేస్తానంటే అప్పుడూ ఈ మౌనమే అడ్డం వస్తే నా నిరీక్షణకి అర్థం వుండదు. నువ్వు తెగించి చెప్పు జయా! ఈ పెళ్లిళ్లు యేవీ చేసుకోననీ నన్నే చేసుకుంటాననీ,' అన్నాడు. అప్పటికే అతని కంఠం ఆర్ద్రమైపోయింది. జయని గాఢంగా కౌగిలించుకుని నుదుటిమీద ప్రేమగా ముద్దుపెట్టుకున్నాడు. జయ పులకలేదు. పలకలేదు. యెక్కడో అంతరాంతరాళాల్లో వున్నాయి ఆ చూపులు. అవి మునపటి మాదిరి బాకుల్లా దూసుకుపోవడం లేదు. వాటిలో నిశ్శబ్దం నిర్లిప్తత తాండవం చేస్తోంది. ఆ కనుపాపల ఆంతర్యం అగాధాల్లోకి త్రోసేస్తున్నాయి. పెదాలు విప్పాలని జయ ప్రయత్నం చేస్తున్నట్లుంది. అవి బలవంతంగా ముడిపడి పోతున్నాయి అంతకంతకు. అంతేకాని వాటిల్లో చలనం లేదు.

'జయా! యిలా చూడు. నేను తప్పు చేశానా? నీకు యిష్టం లేకుండా నేను

యేమీ చేయలేదు. అవునుకదూ. సారథి కోవెల్లో నీకు చేసిన ప్రమాణం అబద్ధం కాదు నువ్వు నాభార్యవి. యింతవరకూ — సంస్కారం వున్న నేను తప్పిదం చేశానంటావా! మాట్లాడవేం జయా,' సాంబశివం ఆ పిల్ల రెండుభుజాలూ అందుకుని కుదిపి కుదిపి అంటున్నాడు. చాలా సేపటికి జయ వెక్కిరిల్లింది. అతన్ని చూస్తూ ఆ గుండెలమీద వాలిపోతూ బావురు మంది.

సాంబశివం సరుదుకుని కూర్చున్నాడు. ఆ పిల్ల తలని ఒళ్లో వుంచుకుని చేయివేసి ఆప్యాయంగా నిమిరాడు. 'ఛ! ఏడవకు. నీకు నేను వున్నాను. నువ్వు త్వరగా వచ్చేయాలి సుమా! యిలా ఉన్నపిల్లలా నువ్వు యేడుస్తూంటే యేం చేయాలో అర్థం కావడంలేదు. నోరువిప్పి మాట్లాడవు. నువ్వే దక్కవని అంటే యెవరైనా నమ్మతారా పిచ్చిపిల్లా.'

జయ తలెత్తి అతని మొహంలోకి చూసింది. రెండుచేతులూ అతని గొంతుకకి పోనిచ్చి వెర్రిదానిలా చూస్తూండిపోయింది చాలాసేపు. ఆఖరిగా అన్నది మాటలో మాట కూడ తడబడుతున్నట్లు.

'మీరంటే ... సాంబూ నువ్వంటే నాకెంత యిష్టం. కానీ కానీ...'

'చెప్పు జయా నీకిప్పుడు వొచ్చిన బాధ యేమిటి? నా ప్రాణం యిస్తాను చెప్పు నీకింతకన్నా కావల్సిన మనుషులెవరున్నారు'

జయ తల అడ్డంగా తిప్పింది. ఆమె మొహంలో నీలినీడలు కదులుతున్నాయి. ఎదురులో జరిగే ఘోర సంఘర్షణకి మొహం ప్రతిఫలింపచేసే మహత్తర యంత్రంలా వుంది. అదేవిధంగా చూస్తూ వుంటే మగవాడైన అతనికే హృదయం ద్రవీభూతం అయిపోయి కళ్లు చెమ్మగిల్లసాగేయి. జయ మాట్లాడలేదని అతను గ్రహించేడు. దూరంగా వెళ్లి టాక్సీని ఆపి యింటిదగ్గర ఆపేశు సాంబశివం.

భారతి ప్రయాణానికి కావలసిన సామాను సర్దుతోంది. అటికెడి తని దృష్టిని గుమ్మం వైపు తిప్పింది. సాంబశివం జయని జాగ్రతగా తీసుకువచ్చి మంచంమీద కూర్చోబెట్టేడు. జయ పూర్తిగా స్పృహలోలేదని గ్రహించేక అన్నాడు 'చూడు పెళ్లి మనం చదివింది డాక్టరీ అనీ, పేషెంట్ లక్షణాలు

తెలుసుకోలేక పోయామనీ అందరూ పరి హాసంగా నవ్వకుండా చూసుకోవాలి. కాళిదాసు కనిపించలేదు విషయం చెప్పాలనుకుంటే. జయ దేకిలా అయిపోయిందో మెంటల్ స్పెషలిస్టుకి చూపిస్తే తెలుస్తుంది.'

భారతి అతను చెప్పేది పూర్తిగావిని: 'అంటే అన్నయ్యా యేదైనా......'

సాంబశివం హడావిడిగా వాచీ చూసుకుంటూ 'టైమైపోయింది. దయకి తెలివివచ్చేక బెంగపెట్టుకో వద్దన్నానని చెప్పు. రాఘవరావ్ గారు అర్జంటుగా రమ్మన్నారు' అతను అలా అనేసి వీధిలోంచి వీధిలోకే వెళ్ళిపోయేడు.

భారతి యెన్నో అడగాలనుకుంది. యేవేవో తెలుసుకోవాలనీ, చెప్పాలనీ అనుకుంది. సాంబశివం భయపడుతూ వెళ్ళిపోతూంటే నోరు తెరుచుకుని చూస్తూండిపోయింది. కాళిదాసు గుమ్మంలో టాక్సీతో ప్రత్యక్షం అయేడు. జయ అప్పటికే లేచి మొహం కడుక్కుని ప్రయాణానికి నవ్వుతూ సిద్ధం అయింది.

*   *   *

వీధిలో రెండు రిక్షాల్లో దిగిన ముగ్గురినీ చూసి మనోరమ లోపలినుంచి గుప్పెడు వుప్పు తీసుకువచ్చి దిష్టితీసి చుట్టూ పాణినీళ్ళు తిప్పేసి కాళ్ళకి నీళ్ళు యిచ్చి మరీ లోపలికి తీసుకువెళ్ళింది. విశ్వనాథం వ్యవసాయం మానుకుని బావమరిది బలవంతాన భార్యా సమేతంగా కాకినాడ వచ్చేశాడు. పెద్దవాళ్ళు అవుతూంటే యిల్లు సందడి తగ్గిపోవడం బిక్కుబిక్కుమంటూ రెండే రెండు ప్రాణులు అంకంత యింట్లో మసలడం రాజశేఖరానికి గుండెల్లో రైళ్ళని పరుగులు తీయించింది. ఆ బాధ బయటికి భార్యతో చెప్పేసి ఆరాత్రికి రాత్రి సఖివేటిపల్లి వెళ్ళి - భార్యాభర్తలిద్దరినీ స్వయంగా వెంటబెట్టుకుని తీసుకువచ్చేడు. పిలుస్తే పలికే నౌఖర్లు లోటులేని జీవితం యెంతో హాయిగావున్నా 'జయ'ని గురించి రాజశేఖరానికి ఆత్రుత యెక్కువైంది. జయని ఒక యింటిదాన్ని చేయాలనే తపన అతన్ని కలవరపరిచింది.

రాజమండ్రీలో పేరు ప్రఖ్యాతులు ఆర్జించుకున్న జడ్జి చంద్రశేఖరంగారి కొడుకుని ఆయనే వెళ్ళి స్వయంగా సిఫార్సు చేసుకు వచ్చేడు. కుర్రవాడు యింజనీరింగ్ పాసై ఖిలాయిలో వుద్యోగంచేస్తూ సెలవు మీద రాజమండ్రీ వచ్చేడు. యెర్రగా, అందంగా, ఆరడుగుల పొడవున్న అతన్ని చూడగానే రాజశేఖరానికి తన కృషి ఫలించిందనిపించింది. పిల్లడుకూడా యక్కువ ప్రశ్నలువేయక బుద్ధిగా ఒప్పేసుకున్నాడు జయలక్ష్మి ఫోటో చూసి. కట్నకానుకల గురించి రాజశేఖరం గుచ్చిగుచ్చి మరీ ప్రశ్నించేడు. జడ్జీగారు అధునాతనంగా అలంకరించిన గృహంలో ఆదర్శాలుగల యిల్లాలిని కట్టుకుని నాగరికతని జీర్ణం చేసుకుని చేతనైనంతవరకూ సంస్కారాలు చేస్తూనే వున్నారు. వారికి పుట్టినబిడ్డ శివరావ్‌కూడా తండ్రికి తగిన కొడుకే అనిపించుకున్నాడు.

భోజనాలుచేస్తూండగా రాజశేఖరం విషయాన్ని వెల్లడిచేశాడు. జయ బొటబొటా కన్నీరు కారుస్తూండడం భారతీ, కాళిదాసూ తప్ప మరెవరూ గమనించలేకపోయేరు. కాళిదాసు మేనమామమాటలన్నీ శ్రద్ధగా ఆలకించేడు.

'పోనీ మామయ్యా! సంబంధం నువ్వన్నట్లు అటువంటిది దొరకదు వొప్పుకుంటాను జయ హౌస్‌సర్జన్ పూర్తికాకుండా పెళ్ళిచేయడం...యేమో నాకైతే కొన్నాళ్ళాగితే మంచిదేమో అనిపిస్తోంది' అన్నాడు.

రమ వడ్డిస్తున్నదల్లా ఆగి 'నీకేం కాళీ భార్యని పక్కనేవుంచుకుని యేమైనా చెబుతావు' అన్నది.

కాళిదాసు డంగైపోయేడు. రమ యేనాడూ అతన్ని ఒక్కమాట అనలేదు. కూతురు గురించి తల్లికి తెలిసినంత తనకి తెలియదని సమర్థించుకున్నా జయ పరిస్థితిని అర్థం చేసుకున్నవాడు కనుక మౌనంగా నవ్వి వూరుకున్నాడు.

రెండుమూడురోజులు గడిచేయి. రాజమండ్రీనుంచి పిల్లను చూసుకువేందుకు రాజశేఖరం బలవంతంమీద తండ్రీ కొడుకులు వచ్చేరు జయ పెళ్ళికొడుకు వైపు రెప్పవేయకుండా చూసింది. అక్కడ అతని స్థానంలో సాంబశివం కళ్ళకు కట్టేడు. ఆరాత్రి యెవరూ చూడకుండా కాళిదాసు గదిలోకి వెళ్ళింది జయ. భారతి అతన్ని కౌగలించుకుని గాఢ నిద్రలో మునిగిపోయింది. జయ దుఃఖానికి అంతూ దరీ లేకుండాపోయేయి. కాళిదాసు వొంటిమీద చెయ్యివేసి అతని చెవిలో మెల్లగా 'బావా!' అంటూ పిలిచింది.

దిగ్గునలేచి కూర్చున్నాడు కాళిదాసు. పక్కన భార్య పడుకునివుండగా జయ 'అలా' రావడం అతని మనసుమీద యెటువంటి పనీ చేయలేదు. జయ యిప్పుడున్న స్థితి యేమిటో యిదమిద్ధంగా తెలియకపోయినా ఆపిల్లపట్ల సానుభూతీ, జాలీయేర్పడ్డాయి.

'బావా!' జయ అతని గుండెలమీద వాలిపోయి బావురుమంది. అలికిడి విని భారతి కూడా లేచి కూర్చుంది. నాలుగుగోడల మధ్య జరిగే తతంగాన్ని నలుగురూ వినకుండా తలుపులు గడియవేసి జయని మంచా



నీకి దగ్గరగా తన పక్కనే కూర్చో పెట్టుకుంది.

ప్రేమానురాగాలు ముంచెత్తగా కాళిదాసు మరదలు తలమీద ఆదరంగా చేయి వేసి 'యేం తల్లీ!' అని అడిగేడు.

'నువ్వు...నువ్వు పాం బ శి వా ని కి పెళ్ళిగాం యివ్వ వా!' జయ ఆపైన మాట్లాడలేకపోయింది.

భారతే స్వయంగా వెళ్ళి రమ పక్కన జయని చేర్చి యథాప్రకారం వచ్చేసింది.

రెండురోజులు గడిచేసరికి రాజశేఖరం ప్రయత్నాలు ఓ కొలిక్కిరావడం ప్రారంభించేయి. జయ మేనత్త, తల్లి సరసంగా మాట్లాడుకునే సంభాషణల్ని శ్రద్ధగా ఆలకించినా మెదడుకి యెక్కించుకోలేక పోయింది. భారతి యేదో అడగాలనుకొనేది నోరు మూతవేసుకుని మౌనంగా వుండి పోయేది. పెరటి గుమ్మానికి తోరణాలు వేయించారు పసుపూ—కుంకాలు దంపించి ముత్తైదువల్ని పిలిచేందుకు జాబితా తయారుచేస్తున్నారు మనోరమా, రమా. అటుకులు దంపించి, మినపప్పు కట్టించేరు. పెళ్ళిపనులు యింత త్వరగా చిటకెవేసేంత వ్యవధిలో జరిగిపోతాయని భారతి కలలో కూడా అనుకోలేదు. జయ మౌనం, భర్త వుదాసీనత ఆపిల్లని మధ్య పీల్చి పిప్పిచేస్తున్నాయి. మనోరమని పిలిచి నెమ్మదిగా అన్నది భారతి 'మాడండత్తా! నాకెలాగోవుంది' అంటూ చేసేపని అక్కడే వదిలిపెట్టేసింది.

రమా, మనోరమా ఖంగారుగా భారతిని చుట్టేశారు. జయ ద్వారబంధానికి చేరగిలబడిపోయివుండడం కాళిదాసు గమనించి రంకెలువేస్తూ లోపలికి వచ్చేడు. 'దానికేదో వలతగా వుంటోంది. లది మన లోకంలో లేని దానిలా ప్రవర్తిస్తోందనీ నెత్తీనోరూ బాదుకుంటున్నాను. నానాట యెవరైనా లక్ష్య పెడతారేమో అంటే అదేమీలేదు. యిప్పుడు భారతికేమైందనీ కట్టుకట్టుకుని వదినా మరదళ్ళు దాన్నిచుట్టేశారు'

రాజశేఖరం ముందు హాల్లో నిలబడి నౌఖర్ని పిలిచి డాక్టరుకి కబురువేశాడు

మనోరమ ముసిముసిగా నవ్వుతూ 'ఈమాత్రం దానికి డాక్టరెందుకులే తమ్ముడూ. మన కాళిదాసు తండ్రి కాబోతున్నాడు' అన్నది హాల్లోంచి భర్త గది

# పరిలిప్తం

లోకి ఈవార్త చేరేసేందుకు బయలుదేరుతూ.

రమ భర్తవైపు ఓసారి చూసింది. కాళిదాసు మేనమామవైపు క్షణం చూసి 'నేను పిలుచుకువస్తాను మావయ్యా' అన్నాడు.

డాక్టరు రావడం జయని పరీక్షించడం జరిగింది. అతను వెడుతూ వెడుతూ 'కంగ్రాచ్యులేషన్స్' అన్నాడు రాజశేఖరం చేతిని చనువుగా అందుకుంటూ. ఆ క్షణంలో రాజశేఖరం తనే ఓ డాక్టరనీ, ఒకప్పుడు జంటనగరాల్లో తన పేరుకు తిరుగు వుండేదికాదనీ, తనే కూతుర్ని పరీక్ష చేయగలడనీ యెందుకో మరిచిపోయిన వాడిలా స్థాణువే అయి నిలబడిపోయేడు. పైపెచ్చు డాక్టరు జయనే పరీక్షించాడో భారతినే పరీక్షించేడో అర్థం కాలేదు అతనికి. అతని బుర్ర అంతకంతకు వేడెక్కిపోతోంది.

డాక్టర్ని సాగనంపి వచ్చిన కాళిదాసు మొహంలో మచ్చుకైనా నెత్తురు చుక్క లేదు. వెల్లవేసి రంగులు వేయించిన పెళ్ళి



వారిల్లు వెలాతెలా పోతుంది కళావిహీనంగా. అతను తూలపడబోతూ కష్టం మీద ప్రయాసగా లేచి నిలుచుని అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి ముందువాలో సోఫాలో కూలబడిపోయేడు రెండు చేతులతో తల పట్టుకుని. మనోరమ వచ్చి అతన్ని కుదిపి లేపింది: 'యేం జరిగిందిరా కాళిదాసూ. శుభమా అని భారతికి నెల తప్పితే నువ్వెందుకురా మొహం చిందించుకుంటావు?'

'అమ్మా!', కాళిదాసు లేచి తల్లిని కౌగలించుకుని బావురుమన్నాడు. 'మనం యింక యిక్కడ వుండొద్దు. ఎక్కడైనా వెళ్ళిపోదాం. మావయ్య, అతను దేవుడమ్మా. ఆ దేవుడికి యింత అన్యాయం జరగకూడదమ్మా. మనం మూసుకుని కుంటాము యిలా అయిపోతూంటే, వంటకి వచ్చిన చేలకి వరద రాకుండా చూసుకోవాలి. మావయ్యకి ఈ విషయం తెలుస్తే గుండెమ్మిన వుందా?'

మనోరమ ప్రశాంతంగా అడిగింది: 'అసలేం జరిగింది?' అంటూ.

కాళిదాసు మాట పూర్తిచేయకుండానే మేడమెట్ల మీదుగా రాజశేఖరం యెప్పుడు వెళ్ళాడో జయని బెల్టు తీసుకుని కఠినంగా శిక్షిస్తున్నాడు.

'నాకు తెలియదు నాన్నా', జయ కంఠం యింతకుమించి సమాధానం యివ్వడం లేదు. ఆ దెబ్బలకి యిల్లు ప్రతిధ్వనిస్తోంది.

కాళిదాసు మెట్లు యెక్కేసి మేనమామ చేతిలో ఆడిపోతున్న బెల్టు లాక్కున్నాడు. రాజశేఖరం మేనల్లుడిని చూసి 'ఈ విషయం నీకు తెలుసా. కారణం యెవరో చెబితే వెంటనే పెళ్ళి చేసెయ్యొచ్చు, యిదీ... యిది యింత పని చేస్తుందనుకోలేదు.' రాజశేఖరం వుద్రేకంతో వూగిపోతున్నాడు: 'చదువు చెప్పించేను. మగవాడు పెరిగినట్లు యే లోటూ రానివ్వకుండా పువ్వుల్లో పెట్టి మురిపెంగా పెంచుకున్నాను. యింత తెగిస్తుందనుకోలేదు. నేను కాదనే వాడినా. సంఘంలో చదువుకున్న వాళ్ళు యెంత ముందుకు పోతున్నారో నాకు తెలియనిదా! తను ప్రేమించానంటే పెళ్ళి చేయకపోయేవాడినా.'

కాళిదాసు తలదించుకున్నాడు దోషిలా

'పెళ్ళికాని ఆడపిల్లలు యెవరైనా యింత మితిమీరి ప్రవర్తించవచ్చునా? నీకు యెవరి మీదైనా అనుమానం వున్నదా'

'నాకు తెలిసినంతవరకూ జయ అటు వంటిది కాదు మావయ్యా'

'హుం,' రాజశేఖరం నవ్వాడు: 'జయ అటువంటిదికాదు. అందర్నీ కలిసి వుండ మనీ దాన్ని జాగ్రత్తగా చూసుకోమనీ మరీ మరీ చెప్పినందుకు మంచి పని చేశావు'

'మావయ్యా!'

'యిదే నీ చెల్లెలైతే, యిలాగే పరువు బజారు కెక్కే పనులు చేసి వుంటే అప్పుడు నా బాధ అర్ధం అయేది. నువ్వు... ఒక్క క్షణం ఆలోచించు. యెవరైనా యిది భరించగలరా'

'... ... ...'

'భగవంతుడు ఇంత అన్యాయం చేస్తాడనుకోలేదు. నేనే సాంబశివాన్ని వెతికి తెచ్చి పెళ్ళి చేయాలనుకున్నాను. దాని నోటితో అది అడిగితే చేయచ్చు అనుకున్నాను. చిన్నప్పటి మమతలు వేరూ, పెద్దవాళ్ళయేక దృక్పథాలు వేరు అయిపోతాయి కనుక ఈ పెళ్ళికి జయ యిష్టపడుతుం దనుకున్నాను. ఇందుకు కారణం సాంబశివం అని అది ఒక్కమాట చెబితే నేను వెళ్ళి అతని కాళ్ళు పట్టుకునే వాడిని. కానీ అది నోరు విప్పి జవాబు చెప్పడం లేదు. తెలియదంటున్నది, ఈ జవాబు చిత్రంగా లేదూ,' రాజశేఖరం గొంతు కఠినంగా మారి పోయింది. నోటికి వచ్చినట్లుగా దుర్భాషలాడి అలసిపోయి తల వొంచుకుని కుర్చీలో కూలబడిపోయేడు. అతనికి రక్తపు పోటు వచ్చేసింది. జయ మంచం మీద బోర్లా పడుకుని కళ్ళు కరిగిపోయేలా యేడుస్తోంది. కాళిదాసు పరిస్థితి వింతగా వుంది. యెవరికి యేమని చెప్పాలో తెలియకా, యే విధంగా వోదార్చాలో అర్థం గాకా అతను కొట్టుకుపోతున్నాడు.

రాజశేఖరాన్ని జాగ్రత్తగా మంచం మీద పడుకోబెట్టేడు. జయని ఒంటరిగా పిలిచి యెన్నో విషయాలు అడగాలనుకున్న అతని ప్రయత్నం సఫలీకృతం కాలేదు. జయ మోకాళ్ళమీద తలని ఆన్చుకుని కంటికీ మింటికీ యేకధారగా యేడుస్తోంది.

(ఇంకా వుంది)

# మంచి తెలుగనేది అసలు ఉన్నదా?

మానవుడు ఇప్పటికి ఎన్నివేల (?) సంవత్సరాల నుంచి మాట్లాడుతున్నాడో ఎవరికీ తెలియదు. అవసరాలనిబట్టి పాత మాటల సహాయంతో కొత్తమాటలని సృష్టించుకునే అలవాటు అన్ని భాషలకీ ఉందని పెద్దలు చెప్తారు. ఈ దృష్టితో చూస్తే అన్ని భాషలూ సమానమయిన శక్తిని స్వాభావికంగా కలవై ఉంటాయని అంగీకరించక తప్పదు.

'ఒకే భాష' అన్నదానికి కూడా సరయిన అర్థం చెప్పడం కష్టం. చైనాలో ఒకే లిపికి ఎన్నోరకాల ఉచ్చారణ పద్ధతులు ఉంటాయి. అంటే శబ్దంలో వేరయినభాషలు రాతలో ఒకటే అనవచ్చునేమో!

మనం ఉచ్చరించే అన్ని శబ్దాలనీ యధాతధంగా సూచించే లిపి ఇంతదాకా పుట్టలేదు. కాని, రాసినదానిని చదివే వారికి అర్థం అయ్యేట్లుగా కనిపించే లిపులు ఎన్నో ఉన్నాయన్న సంగతిని మాత్రం ఎవరూ కాదనలేరు.

తెలుగుకి ప్రస్తుతం వాడుతున్న లిపి ఇటువంటిదేనన్నా తప్పు లేదు. కొంతకాలంకింద పుస్తకాలలో వాడే 'ఒకరకమయిన తెలుగు'ని గ్రాంధిక భాష అంటారు. ఇది ఇంచుమించు తెలుగు మాట్లాడే ప్రాంతాలన్నిటిలోనూ ప్రామాణికంగా ఉండేది—ఉందేమో కూడా.

కాని, ఒక్కొక్క ప్రాంతంవారు ఒక్కొక్కరకం తెలుగు మాట్లాడటమే కాకుండా, ఒకేప్రాంతంలో వివిధవర్గాల వారు, కులాలవారు వివిధంగా మాట్లాడుతారన్నది అందరికీ తెలిసిన సత్యమే. ప్రస్తుతం తెలుగు సినిమాలలో వాడుతున్నభాష (ఇంచు మించు) కొన్ని సర్కారు జిల్లాలలో బ్రాహ్మణ వర్గాలవారు మాట్లాడే భాష. నేడు పత్రికలలో రాసే భాష కూడా అంతే.

ఈరకం భాష మాట్లాడేవారు తమ తెలుగు 'మంచి తెలుగు' అనుకోవచ్చు, అనవచ్చు. ఇది కేవలం మిథ్య! మంచి తెలుగు, మంచి ఇంగ్లీషు అనేవి ఏమిటో వాడుకలో ఉన్న వ్యాకరణ సూత్రాలు తెలుపాలిగాని వ్యక్తిగతమయిన ఇష్టాయిష్టాలు తెలుపలేవు. ఇంకొకవిధంగా చెప్పాలంటే 'ఒక యాసతో మాట్లాడే వర్గంవారి భాషకి సంబంధించిన నియమాలు లేక సాంప్రదాయాలు ఆ భాషకి మాత్రమే వర్తిస్తాయి.' బాగా చదువుకున్నవారు మాట్లాడే భాష చదువుకోని కొందరికి ఎబ్బెట్టుగా కనిపించవచ్చు. అంత మాత్రాన ఎక్కువ తక్కువలు ఉన్నట్లు ఊహించటం ఏ మాత్రం సరికాదు.

(ఈ మధ్య ప్రాంతీయోచ్చారణలకి సంబంధించిన వివాదాలని విన్న తర్వాత ఇలా రాయవలసి వచ్చింది. అంతేకాదు, తెలుగుకి ఉర్దూ ఎంత దూరమో ఇంగ్లీషు అంత దూరమే, ఇంకా లోతుగా చూస్తే సంస్కృతమూ అంత దూరమే. (నేను ఇంట్లో మాట్లాడేభాష తెలుగు సినిమాలకి ఆధారమయిన భాషే కాబట్టి ఎటువంటి పక్షపాతంతోనూ రాయటం లేదని చదివేవారికి మనవి!)

—జి. రామలింగం.



# కార్టూనిస్టూ కాలేజి గర్లూ

నడిమింటి లలిత

గొల్లుమని నవ్వారంతా ఒక్కసారి. శాంతిముఖం మందార పువ్వుకి ప్రతిరూపం దాల్చింది. 'ఎందుకంత నవ్వొస్తోంది?' అంది కోపంగా. 'నవ్వక ఏడవమన్నావా నీ మాటలకి?' అన్నానింకా ఇంకా నవ్వుతూ. 'ఏం? కార్టూనిస్టుకి పుత్తరం రాయడం తప్పా? ఇందులో నవ్వడానికేవుంది?' ఉడికిపోతూ గద్దించింది.

శాంతకి ముక్కుమీద కోపం. 'నవ్వడానికేం లేదూ అనడుగు బాగుంటుంది. కాకపోతే ఏవిటోయ్? రచయితలు, రచయిత్రులు, ఏపిస్టార్లు ఎక్స్ట్రాలెందరో వుండగా...' 'ఆ ఎక్స్ట్రాల్లో ఒకడి కార్టూనిస్టు కాదా?' మధ్యలోనే అందుకుంది. 'అవును అదీ నిజమేకానీ దొరికి [illegible] నీకి [illegible]

సేవూ ఆడదీ—అప్పడాలకర్ర, మగవాడు, మాడుదెబ్బలు తప్ప మరో ప్రపంచం తెలియని వాడికా పుత్తరం రాసేది?' అన్నాను శాంతనింకా ఏడ్పిద్దామని చేస్తూ. 'అవును నాకా కార్టూన్లే నచ్చుతాయి. నేనతనికే పుత్తరం రాస్తాను. రాసి తీరతాను' అంది మొండిగా. 'అయితే సరే కానీ నే చెప్పేమ చూడు నీకు జవాబు మాత్రం రాదు' అన్నాను మరిసాల్లేక. 'పందెం కాస్తావా? నేనీ కార్టూనిస్టుకి లెటర్ రాసి రిప్లై తెప్పిస్తే ఏమిస్తావ్?' అంది పంతంగా పిడికిలి బిగించి.

అసలీ వాదనకి ముందు మామధ్య ఒక రకంగా పెద్ద గొడవే జరిగింది. కథలు రాయడం కష్టమా? కార్టూన్లు వెయ్యడం కష్టమా? అని చివరి బెంచీల్లో మొదలైన చర్చ మొదటి బెంచీవరకూ వచ్చిగానీ ఆగలేదు. ఆ వాదోపవాదాలంతటితో అణగారిపోనూ లేదు. క్లాసు రెండు ముక్కలై ఒకటి కార్టూనిస్టునీ, మరొకటి కథకుణ్నీ సైడ్‌చెయ్యడం మొదలైంది. 'ఈ కాలంలో కథలు రాయటం, కవిత్వం చెప్పడం ఏమంత కష్టం? వాటికేమైనా సాంఘిక ప్రయోజనమా పాడా? తెలుగు నాలుగు వాక్యాలు సరిగ్గా రాయగలిగిన ప్రతివాడూ రచయితే. రేప్పొద్దున్న నేనురాస్తాను 'పరిమళ పారిపోయింది' 'గుండెమండిపోయింది' అని. మా చిన్నిగాడూ రాస్తాడు 'చింతపండు తెచ్చి రాచిప్పలో వేసి, పచ్చిమిరప చిదిమి, పుప్పువేసి' అని ఒక పద్యం.' అంటూ చాలఘాటుగా వాదించింది కార్టూనిస్టు తరఫున శాంత, పుడ్‌లీ అడ్వొకేట్.

నాకూ ఒళ్ళు మండిపోయింది, 'ఈ అక్కడికి మహాకార్టూన్లే ఏడుస్తున్నాయి గొప్పగాను. మేకల మందలా ఒకడే కార్టూను వేస్తే అందరూ అదే పట్టుకుంటారు. అయితే వీళ్ళ ఒరిజినాలిటీ ఏందులోనూ ? ఒకరు పువ్వులచీర వేస్తే మరొకరు గళ్ళచీర; ఒకరు 'హుర్రే' అంటే మరొకరు 'అరెరే!' అనీను తప్పితే భావంలో భేదం సున్నాయే.' అన్నాను వూరుకోలేక.

వింతలా వాదించినా నాకు మిరియాల దంతగే మిగిలింది. కార్టూనిస్టుని గెలిపించి పుణ్యం కట్టుకుంది శాంత. అది మొదలు ఈ లెటర్ పిచ్చి పట్టుకుంది విశాలాక్షికి. ఆ రోజు సాయంత్రం పొద్దున్న ఇద్దరికీ క్లాసు లేకపోవడంతో లైబ్రరీలో దూరాం. మేమూ వెతుక్కుని కూర్చుని కార్టూనిస్టుకి ఉత్తరం (రఫ్ కాపీ) తయారు చేస్తోంది శాంత. నేను మాత్రం 'డోంట్ మేక్ నాయిస్' అన్న బోర్డుకి వెనక్కి తిరిగి కూర్చుని, చేతిలో ఇల్లస్ట్రేటెడ్ వీక్లీలో పెళ్ళికంటలు నాకు వచ్చినట్టు విశదీకరించి నా సంతోషాన్ని పల్లీగా నలుగురితో పంచుకోవడం మొదలుపెట్టాను. ఇది నాకల వాటు. కాకపోతే లైబ్రరీ కొచ్చింది కునుకుదామా? కూర్చొని చదవడానికా ? కాదే కాదు. కావాలంటే ఏ పుస్తకం కాలేజ్ స్టూడెంట్ నన్నా అడగొచ్చు. చేతిలో 'రీడర్స్ డైజెస్ట్' పట్టుకొని పక్కనమ్మాయి చూసే 'మదరిండియా'లోకి తొంగిచూస్తూ విమర్శించడం మా జన్మహక్కు. అయినా ఆడపిల్లల్ని మాట్లాడొద్దనడ మేమిటి ? బుద్ధి తక్కువ.

'ఇదిగో.! ఇది చూడు కొంచెం' అంటూ అంతవరకూ ఖరాబుచేసిన కాగితం నా చేతిలో కుక్కింది శాంత. చదివాను. శ్రీ హరిబాబుగారికి !...నమస్కారం (మస్కాలు కొట్టడం బాగానే వచ్చు నీవిడగారికి.) కార్టూన్లద్వారా మీరు నాకు పరిచయమే. నేనెవరో మీకు తెలుసు (పాఠకురాలిని.) మంచి కార్టూన్లు వేస్తున్నందుకు, వెయ్యగల్గుతున్నందుకు కంగ్రాట్యులేషన్స్. నేననుకున్న ఎన్నో రకాల కార్టూన్లు వేశారు ఒక్కటి తప్ప. అదేమిటో అడగొద్దు. ...చెప్తే ఏం బాగుంటుంది ? నాలా ఎప్పుడాలోచించ కలరో, అలా ఐడియా మీకు వస్తుందో రాదో చూస్తాను. బహుశ రాదు. సెలవ్... శాంత.'

'ఈ మాత్రం లెటరుకి నలభై నిమిషాలు; ఇరవై పైసలూ వేస్టు ?' అన్నాను నిస్పృహగా. 'వేస్టేమిటి శకున పక్షి !' అంటూ పళ్ళు బిగించింది; లేచి నిల్చుని. నేనూ లేచాను. శాంతెక్కడుంటే నేనక్కడుండాలి. నే నెక్కడుంటే అక్కడే శాంత వుండేది. అది రూలు. నడుస్తున్నంతసేపూ దారి కిరువైపులా వుండే మొక్కల ఆకులు తెంపుకుంటూ ఆలోచిస్తున్న శాంతని పరికించలేను.



ఏమిటో చాల తీవ్రంగా ఆలోచించేస్తోంది.

'ఏమిటండీ దూర్వాసుల శాంతాదేవీ! అంత దీర్ఘంగా ఆలోచించేస్తున్నారు?' అనడిగాను అటు చూశాక. 'కార్టూనిస్టుకి వుత్తరం రాస్తే నేం?' అంది పరధ్యానంగా. చుట్టూ తిరిగి మొదటికే వచ్చిందీ విషయం! 'తప్పేం లేదు నవ్వొస్తుందంతే' అన్నాను తేలిగ్గా. 'ఆ నవ్వుమాత్రం ఎందుకురావాలీ ? కానీ...' అంటూంటే ఆపేశాను 'కాసీల కాలం పోయిందోయ్ విశాలాక్షీ ! పైసా అను.' అంటూ.

'అబ్బ! కొంచెం సీరియస్ గా వుండడం నేర్చుకుంటూ నీకు పుణ్యం వుంటుంది. సరిగా చెప్పు. నా వుత్తరం చూసి నవ్వు కుంటాడా?' అంది సందేహంగా. 'పిచ్చిదానా గ్రే. అది నేనేం చెప్తాను ? జానపద చిత్రాల్లోలా ఒక మాయాగోళం నాకుంటే బాగుండును' అన్నాను నీరసంగా. క్రింది పెదవి కొరుక్కుంటూ కొంచెంసేపాగి మళ్ళీ 'అడ్రసేదివ్వనూ?' అంది. అన్నీ సందేహాలే. 'ఇంటి అడ్రసే ఇయ్యి. ఏం?!' అన్నాను. 'నిజమే. ఇంటడ్రసే ఇస్తాను. గాడిదగుడ్డు ఏముందిందులో' అంది స్థిరంగా. 'విష్ యు సక్సెస్' అన్నాను నవ్వుతూ. 'కట్టిపెట్టవోయ్ నీ కవ్వింగ్ పెత్తల్సు' అంటూ ఒక జెల్లికొత్తు అక్కడికి వాళ్ళింటి పండు రావడంతో అటు వెళ్ళిపోయింది.

ఎవరిదారి వాళ్ళు పట్టేశాం. అసలీ విద్యార్థిదశ ఒక వానరదశ. ఇప్పుడు చేసే ఇటువంటి చిన్నచిన్న పెంకెపనులకి తర్వాత అర్థం వెతికితే వచ్చేది నిండు సున్నాయే నేమో! బుర్రలో పుట్టిందేదో ఆచరణలో పెట్టేవరకూ నిద్రపట్టని తోక తక్కువ జాతిది. ఇంటికి వెళ్ళినా శాంత వుత్తరమే బుర్రలో తిరుగుతోంది. రాత్రి పుస్తకం తీసినా సాయంత్రం మా మాటలు మరపుకు రాలేదు. ఆఖరికుండబట్టలేక విజయ నడిగాను మెల్లిగా 'కార్టూనిస్టుకి లెటర్ రాస్తే ఎలా వుంటుంది?' అని: 'రాసి చూడ రాదూ? నీకు కొత్తేంకాదుగా' అందది పేపర్ రోంచి తలెత్తైనా ఎత్తకుండా అతి బద్ధ

...నిజం చెప్పాలంటే నా కవిత్వం
పిచ్చి ముదురుపాకంలోనే వుంది. కాని అది కేవలం రచయితలకీ, రచయిత్రులకే పరిమితం అయిపోయింది. నాకు బాగా నచ్చిన కథా రచయితకిగాని, అతి చెత్తగా అన్పించిన కథా రచయితకి గాని నిష్పక్షపాతంగా పొగడ్తలూ, తెగడ్తల వుత్తరాలు అందించేస్తూంటాను. ఇంట్లో అందరికీ ఈ విషయం తెలుసు. నాలో నేనే నవ్వుకుంటూ అర్ధంపర్ధం లేకుండా వూహాగానం చేసుకుంటూ మొత్తానికా రాత్రి చదువుకి ఎగనామంపెట్టి పక్క జేరిపోయాను.

వుత్తరం పోస్ట్ చేసిన మర్నాటి నుంచి శాంతకింకో బెంగ పట్టుకుంది. 'ఇంత కష్టపడి పదిహేను పైసలు దండగపెట్టి రాశాను గదా! యట్‌లీస్టు వాడది చదవనైనా చదువుతాడంటావా?' అందో శుభదినాన మరుండ బట్టలేక. ఒళ్ళు మండిపోయింది నాకు. 'ఉహ్హూఁ! చదవడు. సిగరెట్ వెలిగించుకుందికి తీసిన అగ్గిపుల్లతో సుతారంగా నీ లెటర్ కాల్చిపారేస్తాడు. సరా!' అన్నాను చిరాగ్గా. కోపంగా జడపట్టు లాగి వెళ్ళిపోయింది వాళ్ళ క్లాస్‌కి. 'ప్చ్! ఆ పదిహేను పైసలుంటే హాయిగా వంద చామంతి పువ్వులు కొని పెట్టుకొనేదాన్ని. అనవసరంగా దండగ పెట్టాను. ఛ!' అంది మరోనాడు.

నాకు జాలేసింది పాపం. ఎంతైనా ప్రాణస్నేహితురాలు కదా! ఓదార్చాలన్పించింది. 'నీకు జవాబొస్తుంది శాంతా! నే చెప్పేను చూడు. ఎందుకంటావా? ఒకటి ... ఆడపిల్లవి అప్పడాల కర్రల కార్టూన్లు మెచ్చుకున్నావు. రెండు...అక్షరాల ఆడదానివి వుత్తరం రాశావు. ఇంక ముచ్చటగా మూడోది, అతిముఖ్యమైనది ... ముప్పితంగా నాలా ఆలోచించడం చేతకాదంటూ సవాల్ చేశావు. అందుకని నిజంగా అతను నిజంగా మొగవాడే అయితే చిర్రెత్తుకొస్తుంది, నీకు జవాబు వచ్చి వాలుతుంది గన్‌షాట్‌గా' అన్నాను. 'ఏమో! ఇదెవర్తి మధ్యన అని చింపిపారేస్తే...' 'వాడి అబ్బకైన తరముగాదు' అన్నాను పాట పాడుతున్నట్టు. 'కాని ఈ వారం హాయిగా చదువు. వచ్చేవారం పోస్ట్‌మాన్ కోసం కాపు వెయ్యి.' అని చిన్నగా మందలించాను కూడ పైపైకి.

# కార్టూనిస్టూ...

ఆ తర్వాత కొద్దిరోజులు (ఎన్నో గుర్తులేవు) చాల మామూలుగా నడిచిపోయాయి. టైమయేసరికల్లా మార్క్యుడొచ్చేస్తున్నాడు. కాలేజ్‌కి వచ్చేటప్పుడు, వెళ్ళేటప్పుడూ కూడా ఇంటి గుమ్మంలో నిల్చుని 'కాలేజ్ ఫర్ వుమెన్ ... కాదు కాదు కాలేజ్ ఫర్ విడోస్' అంటూ మా తెల్ల యూనిఫాం చూసి కొంటె కోణంగి వెక్కిరిస్తూనే వున్నాడు. శంచన్‌గా కిళ్ళీ బడ్డీ దగ్గర నిల్చునే రోమియో డిల్‌గా 'చిట్టెమ్మా, చిన్నమ్మా చూడవమ్మా వన్నా...' అంటూ రాగాలాలాపిస్తూనే




వున్నాడు. (ఈ సినీ కవుల ధర్మమా అంటూ ఆడవాళ్ళనెలా ఏడిపించడం అన్న సమస్యే లేకపోయిందీ జులాయి వెధవలకి.)

కాని ఒకరోజు మాత్రం ఇంగ్లీష్ క్లాస్‌రూం ముందు వరండాలో నిల్చున్న నా దగ్గరికి, చూసే వాళ్ళంతా ఈ పిల్ల కాలు జారి మధ్యలో పడదుగదా అన్పించేటంత దూకుడుగా వరదలా జర్రున వచ్చి చుట్టేసింది శాంత. 'ఏమిటి కథ?' అవడిగాను వులాసంగా. 'విక్టరీ' అంది చెంప ఛెళ్ళుమన్పించి. 'ఎందులో' అన్నానయోమయంగా, చుర్రుమంటూన్న చెంప రాసుకుంటూ. 'రిప్లై వచ్చిందోయ్.' అంది రెండో చెంప పుణ్యం కట్టుకొని. సంతోషం వస్తే ఇదే బాధ ఈ అమ్మాయితో. ముందు తన్ని తర్వాత మాట్లాడుతుంది, 'నీ విక్టరీ పాడుగానూ! నన్ని వాళ ప్రాణాలతో వుంచు' అని బతిమాలుకుంటూ క్లాస్ లోపలికి లాక్కెళ్ళాను. 'ఇవాళ ఫస్ట్ సీట్స్ వద్దు' అంటూ ముద్దు ముద్దుగా గునిసింది.

వెనక్కి వెళ్ళేలోగా లెక్చరర్ వచ్చేసింది కొంప అంటుకుపోయినట్టు. చచ్చినట్టు ముందరే కూర్చుండిపోయాం. ఆ గంటసేపు మా బాధ చూడాలేగాని, చెప్పతరం కాదు. లెటర్ చూపించాలనే ఆత్రం పట్టలేకపోతోంది శాంత. ఎంత తొందరగా ఆ విషయాలు వింటానా అని కొట్టుకు పోతున్నాను నేను. మా యిద్దరి ప్రాణాలకీ బ్రహ్మరాక్షసిలా తగులుకుందీ లెక్చరర్. గీమంటూ ఆవిడ పాఠం పాడుగానూ! బెల్ కొట్టేసరికల్లా సీట్‌కేదో స్ప్రింగ్ యాక్షనున్నట్టు లేచి నిల్చున్న మమ్మల్ని చూసి కోపంతో దుంపనక్కలా మొహం పెట్టుకు నిష్క్రమించింది విసవిసా. (అప్పట్లో అది గమనించే మూడ్‌లో లేం.)

'ఇప్పుడేమిటి? ప్రాక్టికల్సా?' కంగారుగా అడిగింది శాంత. 'ఆఁ. కెమిస్ట్రీ కూడాను' అన్నాను బెంగగా. 'పోన్లే. ముందు విషయాలు చూడు. వివరణ తర్వాత.' అంది హడావిడిగా కవరు విప్పి. నోట్లో పెట్టుకున్న అన్నం నమలకుండా మింగేసినట్టు ఆదరా బాదరాగా చదివేసి లాబ్ వైపు పరుగెత్తాను. ఇలాటప్పుడే నాకు శాంతంటే అసూయ. రికార్డ్సా, ప్రాక్టికల్సా, దిబ్బా దిరుగుండం లేని దర్జా అయిన గ్రూప్ ఆ అమ్మాయిది, ఎమ్. ఇ. పి. నాదో? ... డబ్బా ఫిజిక్సు, డొక్కు కెమిస్ట్రీ. ఆ పోలటిక్సూ, ఎకనమిక్సూ వంట బట్టక, ఈ దిక్కుమాలిన మాథమేటిక్సంటే ఆశ చావక, ఖర్మం చాలక భరిస్తున్నానీ బోరింగ్ మెషీన్స్ రెండిటినీను. ప్రాక్టికల్స్ చేస్తున్నానన్న మాటేగానీ, ఆలోచనలు మాత్రం కార్టూనిస్టు లెటర్ చుట్టూ గిర గిరా తిరుగుతున్నాయి.

'నువ్వూ కార్టూన్లు వేస్తావా?' అట. ఓయ్ పిచ్చివాడా! తను కార్టూన్లు వేస్తే నీ కార్టూన్లెందుకు చూస్తుంది? అనుకుంటూ, నవ్వుకుంటూ టెస్ట్ ట్యూబ్‌లో వున్న సొల్యూషన్‌లోకి రెండో చేతిలోవున్న

# ప్రత్యేక సదుపాయం!

సరకు ఉన్నంత వరకే

~~60~~ పైసల ఖరీదైన ప్రత్యేకమైన
క్రొత్త డిజైను ప్లాస్టిక్ గ్లాసు
10 పైసలకు మాత్రమే మీకు
ఈ డబ్బాలో లభిస్తుంది







ప్రతి డబ్బాలో ఇదివరకు ఉన్నంత బోర్న్విటా
(450 గ్రా. నికరం) ఉంటుంది.

శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం – క్యాడ్‌బరీస్ బోర్న్విటా!

...వండాను ఇది తెలిరి టెస్ట్. ప్రెసిపిటేట్ వచ్చేస్తే చూపించి రిపోర్ట్ చేసెయ్యొచ్చు. కానీ...ఏదీ ప్రెసిపిటేటూ ?... చాల తీక్షణంగా కళ్ళు చిట్లించి చూసినా, ఎండలోకీ, నీడలోకీ తెస్తూ టెస్ట్ ట్యూబ్‌ని అష్ట వంకర్లూ తిప్పి చూసినా, గిలకొట్టినా, ... అబ్బే. చీమ తలకాయంత నలుసైనా పడలేదు. అంతా క్లియర్ సొల్యూషనే. ఏమైంది చెప్మా! పిలిస్తే పలికే బంగారంలాటి టెస్ట్ ఇలా తగలడిందేం? అనుకుంటూ అనుమానంగా చేతిలో బాటిల్‌వంక చూసాను. దాని మీది అక్షరాలు చూస్తూనే కళ్ళు చీకట్లు కమ్మేశాయి. నా బుర్రంతేసి అక్షరాలు 'ఏహేహ్హే' అంటూ నవ్వుతున్నాయి. అదీ సంగతి. పొటాషియం ఫెర్రోసైనైడ్ వెయ్యాల్సిన చోట్లో హైడ్రోక్లోరిక్ యాసిడ్ ఎంతనిపోస్తే వస్తుంది రిజల్టు? చిబ్బ. ఇంతవరకూపడ్డ పాట్లన్నీగోవిందా... గోహ...విందా... 'కొంపదీశావ్ గదోయ్ కార్టూనిస్టూ' అనుకుంటూ ఆ కోపాన్ని ట్యూబ్‌మీద చూపిస్తూ 'ఫట్'మని టాప్ కేసి కొట్టి డొక్కులో పడేశాను.

రెండోసారి ఒళ్ళు దగ్గర పెట్టుకొని చేశాను. ఏం లాభం ? రిపోర్టిచ్చే వేళకి 'ఇక చేశావ్‌లే వెళ్ళు'. అంటూ గణ గణ మంది బెల్. ఎలాగో ఆ ఒక్కటి పూర్తయిందనిపించి వుసూరుమంటూ ఇవతల కొచ్చాను. అక్కడే స్తంభం దగ్గర నిల్చున్న శాంత నన్ను చూస్తూనే 'ఈ కార్టూనిస్టు వుత్తరం ఎంతపని చేసిందీ తెలుసా?' అంటూ మొదలు పెట్టేసరికి ఇంక ఆగలేక 'ఆ లెటరు పట్టికెళ్ళి మీ అమ్మ కిచ్చేద్దూ కుంపటంటించుకుంటారు. దాని ధర్మమా అని నా ప్రాక్టికలంతా మసైపోయింది. ఛ! ఛ!' అన్నాను విసురుగా. 'అయ్యో పాపం! ఇవాళ తన్నేశాయా? పోన్లెద్దూ బోడివెధవ ప్రాక్టికల్సు. రేపు చేసుకో. ఇటు విందూ !' అంది వుత్సాహంగా.

నా క్కావల్సిన సానుభూతి వచ్చేసిందిగా. ఇంక మామూలుగా అయిపోయి అటు తిరిగాను. 'నిన్న నేను కాలేజ్‌కి కొచ్చేక ఆ లెటరిచ్చాడోయ్ డర్టీ పోస్ట్ మాన్. మామూలుగా నా టేబిల్‌మీద పడేయ కోతూ కవరుకి రెండో వైపేదో కన్పిం

# కార్టూనిస్టూ...

చడంతో తీక్షణంగా పరిశీలించింది అమ్మ. చక్కగా ఆర్టిస్టిక్‌గా చెక్కాడీ మహానుభావుడు 'హరి' అని. దాంతో ఎవడీహరి? ఏమా కథ ? అనుకుంటూ సుబ్బరంగా విప్పి చదివేసింది. ఇక చూస్కో. సాయంత్రం నే నింటికి వెళ్ళేసరికి ఓ పెద్ద ఫార్సు గుమ్మంలోకి అడుగుపెట్టానోలేదో 'ఓయ్ కాలేజ్ గర్ల్ ! కార్టూనిస్టు లెటర్ రాశాడే' అన్నారు నాన్నగారు.

విప్పి చదివారని అర్థం అయిపోయి నా గుండె గుభేలుమంది. వుత్తరాన్ని నా చేతుల్లో పెట్టి అమ్మా, నాన్నగారూ విశేషాలు వర్ణించేశారు. 'ప్రియమైన శాంతికి' అబ్బో! నువ్వు ప్రియమేనటేవ్! చవక కాదట' అని నాన్నగారు ... 'నీ చిన్నారి బుర్రలోకి వచ్చిన ఆ నాస్టీ అయిడియా ఏమిటో ?...వుహూ... నాకు తెలీడంలేదు...ఇదెక్కడి నాస్టీలాంగ్వేజీ ?' అంటూ అమ్మ వెక్కిరింతల దీర్ఘాలు.

ఇలాగే వుత్తరంలో ప్రతిమాటా వెక్కిరించి వెక్కిరించి వదిలాంనుకో. మామూలుగా ఆ వుత్తరం చదివితే ఎలా వుండునో గానీ...వీళ్ళ వ్యాఖ్యానాలు జత చేసేసరికి ఒళ్ళు మండిపోయింది. తనైనా ఎందుకంత స్టైల్ చెక్కబెట్టడం ? తిన్నగా రాయకూడదూ ? పైగా మహా గొప్పగా నేనమ్మా జవాబు రాస్తున్నానని పైన పేరుకూడ రాసుకోవాలా ? అమాత్రం నాకు తెలీదా ? ఏమిటో ఆ కార్టూనిస్టు నేనే నన్నట్టుగా ఎగిరిపోతూన్న శాంత నెలా శాంతపరచాలో అర్థంకాలేదు నాకు. ఒక్క ఘడియ ఆగి 'వెంటనే రిప్లై రాశాన్లే. చూడు పోస్ట్ చేయాలి' అంది కవరు తీసిచ్చి.

ఆత్రుతగా చదివాను. 'చవకైన హరి బాబుకి! మీ వుత్తరం అందింది. కార్టూన్లు వేసినట్లుగానే వుత్తరం కూడ అంత నాస్టీగా రాస్తారనుకోలేదు. సరదా అన్పించి వెంటనే జవాబు రాస్తున్నాను. కవరుపైన మీరు దిద్దిన మీపేరు ఎంత గందరగోళం చేసిందో, ఎందరు నవ్వుకుంది కుపయోగ పడిందో నే నిప్పుడు చెప్పలేను. పోతే దానా దీనా మీకు చెప్ప దల్చుకున్న దేమిటంటే ఈ అనుభవం గుణపాఠంగా తీసు



కుని ఇక ముందునుంచైనా, ఇంకే అభిమానులకైనా వుత్తరాలు రాసేటప్పుడు పైన మీ 'సంతకం చెక్కడం' వుపసంహరించుకుంటే బాగుంటుంది (అని నా నమ్మకం). మన స్నేహాన్ని పురస్కరించుకొని మరొక చిన్న విషయం ... కొంచెం పెద్దమనిషి తరహాగా లెటర్స్ రాయడం నేర్చుకుంటే ఇంకా మీ అభిమానుల సంఖ్య పెరుగుతుందనుకుంటున్నాను. బెడ్డనేసి లోతు కనుక్కునే రకం మనుషులుంటారు చూడండి! వాళ్ళముందు మీరిలా 'లుడుంగు'మని తేలిపోవడం బాగుంటుందనుకోను. ఒక స్నేహితురాలిగా ... డియర్ కార్టూనిస్టూ! ఇదే నా రిక్వెస్టు. సెలవ్ ... శాంత.'

వుత్తరం పూర్తి చేసేసరికి నా పళ్ళు జివ్వుమన్నాయి. 'ఇది పోస్ట్ చేస్తావా ?' అనడిగాను పిరికిగా. 'మహర్జాజు బిడ్డలాగ. 'ఏం? ఎలావుంది?' అంది నిర్లక్ష్యంగా. 'ఎలావుందని చెప్పను ? మోతాదు మించిపోయిన మిరియాల చారులా వుంది. కానీలే ... కార్టూనిస్టుకి ఔషధంలా పనికొస్తుందేమో!' అన్నాను మెల్లిగానే. అప్పటికప్పుడే నా ఎదురుగానే కాలేజ్ పోస్ట్‌బాక్స్‌లో వేసింది. ఆ తర్వాత అడిగింది తాపీగా 'దీనికెలాటి రిప్లై వస్తుందంటావే? అసలు వస్తుందా?' అని. ఏం చెప్పాలో తెలీక స్టైల్‌గా బుర గోక్కుని 'రిజల్ట్ ఈజ్ ఎవైటెడ్' అన్నాను.

కాని ఎన్నోరోజులు ఎదురుచూడ నవసరంలేకుండానే వచ్చింది వుత్తరం. ఇలా

అలా కాదు వెళ్ళ మీరకపోయే కారణంలా నన్ని కాని కంటుకుపోయేట్టు వుంది (అనుకున్నాడా కార్టూనిస్టు)—ఆ సమయానికి నేనూ అక్కడే వున్నాను. ఎప్పటిలాగే మామూలుగా ఆరోజు సాయంత్రం శాంత దగ్గర కెళ్ళాను. డాబామీద కూర్చుని ఏవేవో విశేషాలు చెప్తూ హఠాత్తుగా 'అన్నట్టు మరి కార్టూనిస్టేమీ మాట్లాడ లేదు సుమా?' అంది నవ్వుతూ. 'బాగా కోపం వచ్చుంటుంది పాపం!' అన్నాన్నేను— 'పోన్లే కాని ఈ తప్పు మరొకరిపట్ల చెయ్యకుండా వుంటే చాలు లేకపోతే అనవసరంగా తేలికై పోతావోయ్.' అంది జాలిగా. సరిగ్గా అప్పుడే పోస్ట్‌మాన్ వచ్చి ఆగడంతో 'కార్టూనిస్టు చల్లగుండా! వెళ్ళి అందుకో' అన్నాను వుత్సాహంగా. గుర్రున క్రిందికి వెళ్ళిపోతూ 'చల్లగుండా? చల్లకుండా?' అంది ఖుషీగా. తాపీగా చాప తెచ్చుకు వేసుకుని తీరిగ్గా 'వగుపు' అంటూ పక్కనకూర్చుంది, నేను చదివే విషయాల్ని కామెంట్ చేస్తూ. 'ప్రియమైన శాంతికి!...' 'ఇంకా ప్రియంగానే వున్నానా బాబూ!' 'ఇలా సంబోధించడం చనువున్నవాళ్ళ లక్షణం. మా స్నేహితు లకిగాని, చెల్లికిగాని, భార్యకిగాని, వుత్తరం రాసేటప్పుడిలాగే సంబోధిస్తాను నేను. 'మరోలా సంబోధించడం రాకపోతే ఏం చేస్తారు పాపం?' 'పోన్లెద్దూ! ఎలా సంబోధిస్తేనేం?' అన్నాన్నేను చిరాగ్గా వుత్తరం చదవడం ఆపేసి. 'అప్పుడే మడిచేస్తేనేం? చదువ్వూ?' అంది గట్టిగా. 'నావుత్తరం నాస్టీగా వుందన్నావు. వాటెమిస్ వాండెడ్ గర్ల్ యు ఆర్!' 'అయ్య బాబోయ్! ఛేంజిట్ ఇంటు ఎక్స్‌ప్రెషన్.' అంటూ కిలారుమని నవ్వి 'గ్రామర్లో ఎన్ని మార్కులు. లాస్టాయో అడగనా?' అంది వెంటనే. ఆ తర్వాత వాక్యం చూస్తూనే నాకు హుషారెక్కింది. 'పెళ్ళయిందా? గాడ్ బ్లెస్ యువర్ పూర్ హస్బెండ్' 'థాంక్యూ!' అంది. ఆ తర్వాత చాల తొందరగా చదివేశాను. 'నా విలువ నాకు తెలుసు. నువ్వు చవకన్నంత మాత్రాన అయిపోను. స్నేహితుడిగా చిన్నసలహా విను. అడక్కుండా పెట్టకుండా ఇలా వుచిత సలహాలివ్వడం అలవాటు తగ్గించుకుంటే నువ్వూ నలుగుర్లో భేషనిపించుకుంటావు. ముందు నా కార్టూన్లు బాగున్నాయంటూ తర్వాత నాస్టీగా వున్నాయంటున్నావా? ఆడదాని వనిపించుకున్నావు. నీ వుత్తరానికి తిరిగి జవాబు రాయాలనిపించలేదు. వూరుకో వాలనీ అనిపించలేదు. అందుకే ఈ ఆఖరి బదులు...' చదివేసి కాగితం మడిచాను, శాంతముఖం చూస్తూ.

చెవుల దగ్గర్నించి ముఖం అంతా ఎర్రగా అయిపోయింది కోపంతో. నీరెండలో పక్కాపాటుగా ఆ ముక్కు, మూతి తమాషాగా అందం చిందాయి 'ఏమిటోయ్ ఈ కార్టూనిస్టు ద్వేషం? ఆడది ఆడదన్పించు కోడంలో వింతేముంది? ఎవరిలా వాళ్ళుండక ఎదటి వాళ్ళలా వుంటారా? ఆడపిల్లలా అతగాడు పుడుక్కున్నాడు కదా అని నువ్వు మొగవాడిలా బుద్ధి లేకుండా వుండమనా? ఛ! ఇంతమాత్రం వుత్తరాన్ని తేలిగ్గా తీసుకోలేక పోయాడీకార్టూనిస్టు. బెటర్ నాస్టీగా వుందని ఏ సందర్భంలో రాశానో, అసలెందుకు రాశానో బుర్ర లేదూ? మహా గొప్ప పరిచయం వున్నట్టు అతి చనువుగా 'నీ చిన్నారి బుర్రలో కొచ్చిన ఆ నాస్టీ ఐడియా ఏమిటో...' అని రాశాడు కదా! ఏమనుకొని రాశాడు? అదే అర్థంలో నా వుత్తరం చదువుకుంటే ఎందుకంత కోపం రావాలి? అన్నాడెప్పుడో పడ్డాడప్పుడే పడేశక్తి లేనప్పుడు అనడం మానుకోవాలంతే.' మహా వుగ్రంగా [illegible] కళ్ళు పెద్దవి చేసుకొని.

తేలిగ్గా నవ్వేశాను. 'నువ్వెందుకంత ఇరిటేట్ అయిపోతావూ? ఏ మనిషి నెలా వంచడమో తెలీక వుక్రోషంతో చేతి కొచ్చింది రాసి పడేసాడు పాపం! కానీ నేను ఆ కార్టూనిస్టునైతే ఎలా రాసే దాన్ని తెలుసా?' అన్నాను నా ధోరణిలో. మాట్లాడకుండా తీక్షణంగా చూసింది. 'కారు చవకై పోయిన (ఒకప్పటి) ప్రియమైన శాంతి! అందుకో నా ఈ దీవనలు (?) ఇలా వుత్తరాల్లో వాడే 'ప్రియా'నికి, మామూలు ధర వరల విషయంలో వాడే 'ప్రియా'నికి తేడా తెలీనంత చిన్న మనసు నీదని అనుకోలేక...' 'చాలింక ఆపు' అంటూ నా నోరు మూసేసి 'నువ్వు కార్టూనిస్టు కాకపోవడం నా అదృష్టం' అంది తేలిగ్గా నవ్వి.

ఆ ముఖంలో వికాసం చూసాక నా ప్రాణం హాయనిపించింది. 'అయితే ఈసారి రిప్లై ఎలా వుంటుంది? కషాయంలాగా?' అన్నాను వుత్సాహంగా. 'ఇంకా రిప్లై ఇస్తానా? బుద్ధొచ్చింది. మరెప్పుడూ ఇలాంటి నాస్టీపని చెయ్యను' అంటూ గట్టిగా లెంపలు వాయించుకుంది. ఆ పోజు చూస్తుంటే నాకు నవ్వు ఆగలేదు. కార్టూనిస్టూ, కాలేజీగర్లూ ... ఇద్దరికిద్దరే. ●



# గణాధిపతయే నమః

గణానాం త్వా గణపతిగ్ం హవామహే
కవిం కవీనా ముపమశ్రవస్తమమ్,
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనఃశృణ్వన్నూతిభి స్సీదసాదనమ్.
భూతగణాలకు అధిపతివైన ఓ గణ
నాయకా!

నీకు గణాధిపత్యం రావడం ఒక విచిత్ర సంఘటన కదూ!

తన కొడుకు లిద్దరిలోనూ గణాధిపత్యాన్ని వహించే సామర్థ్యం యివ్వరికున్నదో పరీక్షించాలనే సంకల్పం మహేశ్వరుడికి కలిగింది. ఆయన నిన్నూ, నీ సోదరుడు కుమారస్వామినీ పిలిచి 'మీ యిద్దరిలో భూమికి ప్రదక్షిణం చేసి, యెవరు ముందుగా వస్తే వానినే గణాధిపతిగా చేస్తా'నని చెప్పాడు. వెంటనే కుమారస్వామి తన మయూర వాహనాన్ని ఎక్కి బయలుదేరాడు. ఎలుక వాహనం యెక్కి నువ్వు అతనితో పోటీ పడగలవా? క్షణకాలం ఆలోచించి నీవు నీ తండ్రికి ముమ్మారు ప్రదక్షిణంచేసి, ఎదుట నిలిచి 'భూ ప్రదక్షిణం చేసివచ్చా' నన్నావు. పరమేశ్వరుడు ఆశ్చర్యపడుతూ ఉండగా 'తండ్రీ! సమస్త లోకాలూ నీ కుక్షిలోనే ఇమిడివున్నాయి గదా! భూలోకం వాటితో పాటే కదా! నీకు ప్రదక్షిణం చేస్తే భూమికి ప్రదక్షిణం చేసినట్లు కాదూ? ఒకసారి కాదు. ముమ్మారు ప్రదక్షిణం చేశాను' అని అన్నావు. నీ బుద్ధికీ, యుక్తికీ సంతోషించి ఆయన నిన్నే ప్రమథగణాలకు అధిపతిగా చేశాడు. 'పొట్టివాడికి పుట్టెడు బుద్ధులు' అన్న సామెత నీ విషయంలో సార్థకమయింది.

పొట్టిగా వుంటేమాత్రం, అందంగా వుండేవాళ్లు లేరూ? అదేమి ఖర్మమోగాని, అందరు దేవతలలోనూ నిన్ను మించిన అందవికారమైనవాడు మరొక్కడు లేడు. గుజ్జురూపానికిలోడు కుండ బొజ్జా, ఏనుగు తలా, ఏకదంతమూ, చిన్నకళ్లూ, పొట్టి చెవ్వులూ, ఎలుక వాహనమూ చక్కగా సమకూరాయి. అందరి శరీరాలూ రక్తమాంసాస్థులతో తయారైతే నీ దేహం నలుగుబిండితో తయారైంది. ఇట్టి రూపాన్ని చూస్తే ఎవ్వరికి నవ్వు రాకుండా వుంటుంది? నవ్వితే కోపించడం నీకు ధర్మమేనా? నీ జన్మదినమైన భాద్రపద శుద్ధ చవితినాడు సాయంత్రం మూషక వాహనం యెక్కి నీవు పొలాలగట్లంట షికారు వెళ్లుతూవుంటే చూచి చంద్రుడు నవ్వితే తప్పా? ఆ అపరాధానికి లోకంలో చంద్రుడు లేకుండా చెయ్యడానికి మీ అమ్మ యత్నించడం ఏమి న్యాయం? ఆ చంద్రుడి మీది కోపం కొద్దీ, ఆ చవితి చంద్రుణ్ణి చూచిన వాళ్లందరికీ నీలాపనింద వస్తుందని శాసించడం ధర్మమేనా? అయినా, నీ కథ చెప్పుకొని, అక్షింతలు వేసుకున్న తర్వాత చంద్రుణ్ణి చూడవచ్చునంటూ ఆ చల్లని తల్లి కొంత అనుగ్రహించినందుకు పార్వతీదేవికి అందరూ చెయ్యెత్తి మొక్కవలసిందే!

కాకిపిల్ల కాకికి ముద్దు! తన కుమారుడు ఎంత కురూపి అయినా తల్లికి అందంగానే కనబడతాడు. ఇతరులు ఆ కురూపిని ఉడికించినకొద్దీ తల్లి, అతడి స్థాయిని హెచ్చించడానికే ప్రయత్నిస్తూ వుంటుంది. ఈ కారణాన్ని బట్టే కాబోలు నీకు దేవతల్లో ప్రాముఖ్యం లభించింది. మిగిలిన దేవతలకు ఎప్పుడో ఒకప్పుడు పూజలు జరుగుతాయి. కాని నీకు ఎప్పుడూ జరుగుతూ వుంటాయి. ఏ దేవతకు పూజ చేసినాసరే, ఆ పూజకు ముందు వినాయకుడి పూజ జరగవలసిందే! ఒక పసుపు ముద్దకయినా నీ పేరుపెట్టి పూజిస్తే చాలును. అంతేకాదు. ఏ కార్యానికయినా ముందు వినాయకుడి పూజ జరిగి తీరాలి. లేకపోతే నువ్వు వూరుకోవు. నీదగ్గరున్న విఘ్నాల మూటలు విప్పి వాళ్లమీద విరజల్లుతావు. ఆ కార్యం చస్సుగా అణిగిపోతుంది. అందువల్లనే సంకల్పంలో 'అభీప్సిత కార్యస్య నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం ఆదౌ గణాధిపతి పూజాం కరిష్యే' అని చెప్పుకుంటారు. విఘ్నాలకు నాయకుడవు కావడం వల్లనే నీకు వినాయకుడనే పేరు వచ్చింది కదూ!

ఇలా అన్నానని కోపమా? కురూపిని కురూపి అని పిలిస్తే కోపం రావడం సహజమే! కోప్పడకు. విఘ్నాల సంగతిని ఎత్తనులే! వినాయకుడంటే విశిష్టుడైన —ఘనుడైన నాయకుడనే అర్థం చెప్తాను. అప్పుడు నీ పేరు ఎంతో అందంగా కానవస్తుంది. ఇది అందంగా వుందనే గౌతమ బుద్ధుడుకూడా తన్ను 'వినాయకు' డని చెప్పుకుంటున్నాడు.

ఓ వెనకయ్యా!

నీవు ఎంత విచిత్రమైన వాడవో — నిన్నుగురించిన స్తోత్రాలూ అవీ చాలా విచిత్రంగానే కూర్చబడి ఉన్నాయి.

'అగజానన పద్మార్కం
గజానన మహర్నిశమ్,
అనేకదంతం భక్తానా
మేకదంత ముపాస్మహే.'

నువ్వు గజాననుడవు. అయినా అగజాననుడవనీ, ఏకదంతుడివైనా అనేక దంతుడవనీ విరుద్ధమైన భావాలు ఇందులో తోస్తున్నవి. నీ స్తుతిలో ఈ విధంగా విరుద్ధంగా వుండడం తప్పుకదా! అందుచేతనే అర్థం కుదరడానికి 'అగజానన పద్మార్కు' డంటే పార్వతీదేవి ముఖపద్మాన్ని వికసింపజేసే సూర్యుడవనీ — ఆమెకు ఆనందాన్ని కలిగించేవాడవనీ, 'అనేకదంతం' అంటే భక్తులకు అనేకంగా కార్యసిద్ధులను ఇచ్చేవాడవనీ సరియైన అర్థం చెపుతూ ఉన్నారు.

మరోకవి వర్ణించినది విను —

'భూనాయకం వా ధననాయకం వా
భజన్ భువం వా భవమేతి లోకే
తద్విఘ్ననాథం శరణామి కింతు

సహస్ర శస్త్రం ప్రణమామి నిత్యమ్’

భూనాయకుణ్ణి కొలిస్తే భూమిని ఇస్తాడు. ధనవంతుణ్ణి సేవిస్తే ధనం యిస్తాడు. ఆ విధంగానే—విఘ్ననాయకుణ్ణి భజిస్తే దొరికేవి విఘ్నాలే కదూ! అని నా కక్కర్లేదు కాబట్టి విఘ్నరాజును నేను సేవించను. మహాప్రభో! మా జోలికి రావద్దంటూ వెయ్యి నమస్కారాలు చేస్తాను’ అన్నాడు ఒకకవి. ఎలాగయితేనేమి? తక్కిన వారికి ఒకటిరెండుసార్లు చేతులు జోడిస్తే నీకుమాత్రం వెలకొద్ది నమస్కారాలు వస్తున్నాయి.

చెప్పకేమి? నీలో మహత్తర శక్తులు ఉన్నవి. మూషికాన్ని వాహనంగా చేసుకుని ఆభరణంగా వుండే ఫణిపతివల్ల దానికి ఎట్టి అపాయమూ కలగకుండేటట్లు చేశావు. నీ సాన్నిధ్యంలో సహజ శత్రువులకు పరస్పర విరోధం నశించి మైత్రి చేకూరుతుంది. తలచుకున్నంత మాత్రానే నీ భక్తులకు విద్యాబుద్ధులను ఇచ్చి కార్యసిద్ధిని కలుగజేస్తూ వుంటావు.

ఓ శివకుమారా!

చాలామంది దేవతలు కోరేటట్లుగా నువ్వు ఎక్కువ గౌరవాన్ని ఆశించవు. ఇది నీలోవున్న గొప్ప గుణం. నిన్ను పూజించడానికి ఎవ్వరికీ వ్యయప్రయాసలు లేవు. పువ్వులు అక్కర్లేదు. గడ్డి చిగుళ్లు (దూర్వాలు) ఆకలములు (వివిధ పత్రాలు) వుంటే చాలును. గంధం, వస్త్రం, యజ్ఞోపవీతం, ధూపం మొదలైనవి లేకపోయినా—వాటికి ప్రత్యామ్నాయంగా అక్షతలు ‘వస్త్రార్థం అక్షతాన్ సమర్పయామి’ అని యీమాదిరి అంటూ చల్లితేసరి—తృప్తి పొందుతావు, నైవేద్య మంటావా? మామూలుగా బెల్లం ముక్క చాలును: నీ జన్మదినంనాడు స్వల్పవ్యయ సాధ్యాలయిన కుడుములూ, ఉండ్రాళ్లూ పెడితే చాలు. విలువైన భక్ష్యాలు అక్కర్లేదు. ఇక ఫలాలంటావా? ఇనపదంతాలతో నయినా కొరకడానికి సాధ్యంకాని వెలగపళ్లూ, పండు పూర్తిగా గింజతో నేనిండిన నేరేడుపళ్లూ చాలు. సాధారణంగా యీ పళ్లకోసం ఎవ్వరూ ఆశపడరు.

సర్వ సులభుడవూ, సర్వజనప్రియుడవు అయివుండడంవల్లనే నిన్ను వీరూ, వారూ అనే భేదం లేకుండా ఆసేతు హిమాచల పర్యంతమూ అందరూ పూజిస్తారు.

కోరిన కోరికలు నెరవేర్చే వినాయకుడా! నీ జన్మదినంనాడు మా గృహానికి వచ్చి పావనం చెయ్యవలెనని కోరుతూ ఇదిగో! నీకు స్వాగతం యిస్తున్నాను.

నే నింతవరకూ చెప్పినదానిలో నిన్ను కించపరచే విషయాలున్నాయేమో! నాకట్టి సంకల్పం లేదు. నేను చెప్పిన విషయాలు నీ విశిష్టతను తెలుపగలవనే అనుకుంటున్నాను. ఒకవేళ ఏమైనా తప్పులూ, ఆవకర్షను కలిగించే విషయాలూ ఉన్నట్లు తోస్తే క్షమించు. దాసుడి తప్పు దండం పెట్టడంతోనే సరిపోతుంది కదా!

అందుకనే ప్రారంభంలోనే నీ పాదాలను స్మరించి స్తుతించాను. ఇప్పుడు మరొకసారి మొక్కుకుంటాను—

‘తుండము నేకదంతమును
తోరపుబొజ్జయు, వామహస్తమున్
మెండుగమ్రోయు గజ్జెలును
మెల్లనిచూపును, మంద హాసమున్
కొండొక గుజ్జురూపమును
కోరిన విద్యలకెల్ల నొజ్జవై
యుండెడు పార్వతీ తనయ!
ఓయి వినాయక! నీకు మ్రొక్కెదన్’

—ఆంగీరస.

# చంద్రుడికో నూలుపోగు

చంద్రమా! నీకు వందనములు
అంచనాలకు మించి నిన్ను చేరారు
మానవులు
అవునా, అతిథి సత్కారానికి
వీరేకాదు
అమృత కిరణుడు కూడా దొడ్డవాడేనని
నిరూపించావు
నిన్ను చేరి, తిరిగి రాలేదని
ఎన్నెన్నో ఊహాగానాలు
నీ పందరాని అందానివని
నిఖిల కవిలోక కావ్యగానాలు
నీవు పైకి మంచిగా కనిపించినా
నీళ్ళూ, నిప్పూలేని గ్రహమని
ఎగతాళి చేసినా
పయోముఖ విషకుంభానివి
మాత్రం కావు—
పయోధరములవలె ఆర్ద్ర హృదయుడవు
నీపై కాలూనినవారు
నీటిపై కాలూనినట్లు
నిన్ను లోకానికి పోతారనే వదంతి
నిజంగా నిజం కాలేదు—
అందుకే, మా ప్రతినిధులు
అందని మ్రానిపండుని
అవలీలగా అందుకోగలిగారు
ఏమాటే, ఎవరు చెప్పగలరు
నీ మానస సరోవరంలో
రాజ హంసలు విహరించే
తరుణం మానస్సమైనదేమో?
నీ మౌన హృదయ శిఖరాలపై
శాంతి కపోతము లెగిరే
సమయమాసన్నమైనదేమో?
అందుకే ప్రియమిత్రమా! చంద్రమా!
ఎంత చేసుకున్నా, నీకు నే నర్పించే
నూలు పోగు
సమస్త మానవాళి నివాళి!
నీపై కాలూనిన నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్
— నీలుడు
నిన్ను చేరిన ఎడ్విన్ ఆల్డ్రిన్
— హనుమంతుడు
నీపై పరిభ్రమించే మైకేల్ కాలిన్స్
— వైనతేయుడు
నీకందరికీ నీవు చేసిన
అతిథి సత్కారం
ఈరేడు లోకాల్లోనూ
ప్రతిధ్వనిస్తుంది.
కొందరికైనా నీవందుబాటులో వుంటే
అందరికీ నీ చల్లదనం చేరుతుంది!’
అందుకే నా నివాళి అందుకో
ముందు ముందునిన్ను సందర్శించే
అవకాశం వుందనుకో—!

—పి. ఎస్. గోపాల్




### జరిగిన కథ

ముకుందం, సుందరం, ప్రకాశం, శకుంతల, సుభద్రమ్మగారి సంతానం. పొలంమీద వచ్చే ఆదాయమూ, ముకుందం తెచ్చే కొద్దిపాటి జీతమూ వాళ్ళకి జీవనాధారం. విశ్వనాథంగారు ఆ కుటుంబానికి ఆప్తుడు. సుందరం తెలివైనవాడు. అతనికి మద్రాసువెళ్ళి 'బియ్యీ' చదవాలని వుంటుంది. మొదట్లో కొంత వెనకాడినా ముకుందం అతని అభిలాషని తోసిపుచ్చలేకపోయాడు. సుందరాన్ని అందరూకలిసి మద్రాసు పంపిస్తారు. చదువుమీద శ్రద్ధచూపని శకుంతల మనస్తత్వం గ్రహించి ఒక మంచి సంబంధంచూసి పెళ్ళి చేసేస్తారు. సుందరం చదువు పూర్తి చేసుకుని వస్తాడు. ముకుందానికి పెళ్ళి అవుతుంది.

## 5

గేటు తెరుచుకుని లోపలికివస్తున్న ముకుందాన్ని, సుందరాన్ని, ఆఫీసుగది కిటికీలోంచే చూశాడు జగన్నాథంగారు—చేతిలో కాగితాలు బల్లమీదపడేసి లేచి వరండాలోకి వచ్చి, 'ఏమయ్యా కంగ్రాచ్యులేషన్స్ రండి, రండి' అంటూ ఆదరంగా ఆహ్వానించి లోపలికి తీసుకువెళ్ళాడు.

'మీ నాన్నగారు కోరుకున్నవాటిలో ఒకటి నెరవేరింది. ఆయనేవుంటే ఇవాళ నువ్వింతటి వాడివయినందుకు ఎంత పొంగిపోయేవారో' అంటూ ఆయనే సంభాషణకి వుపక్రమించారు.

'మా కంతటి అదృష్టం వుండద్దండీ' అన్నాడు ముకుందం బాధగా నిట్టూరుస్తూ.

'నాన్నగారు లేకపోయినా అన్నయ్య అభిమానం మీ సహాయం నన్నింతటి వాడిని చేశాయి' అన్నాడు సుందరం.

'భలేవాడివే— వాదేముంది—నేను కాకపోతే మరో యల్లయ్య — ఊళ్ళో డబ్బే పుట్టదన్నట్లు మాట్లాడతావేమిటి' అన్నారు జగన్నాథంగారు.

'ఆ వుపకారం ఏమిటో మాకుతెలుసు—పదిసార్లు మీ దగ్గర అదే మాట్లాడి మిమ్మల్ని మొహమ్మాట పెట్టటం బాగుండదు— కాని అది మేం గుర్తుంచుకుంటే చాలు' అన్నాడు ముకుందం.

'ఊఁ, బాగుంది' జగన్నాథంగారి చిరునవ్వులో వాత్సల్యం తొణికిసలాడింది.

'అయితే ఇంక తరువాత ఏమిటి? ఎక్కడయినా వుద్యోగందొరికే సూచనలు వున్నాయా— అంటే ఇంతకు ముందే ఎవర్నయినా కలుసుకోటం, ఎక్కడయినా ప్రయత్నించటం అదీ చేశావా' అన్నారు సుందరంవైపు తిరిగి.

'లేదండీ, ఈ రిజల్టు ఏదో తెలిస్తే బాగుంటుందని వూరుకున్నాను — మా ప్రొఫెసర్లు ఇద్దరు ముగ్గురికి నేనంటే మంచి ఇంప్రెషన్‌వుంది, నన్ను బాగా లైక్‌చేస్తారు-ఈరిజల్టు విషయం వాళ్ళకి పెర్సనల్‌గా వ్రాస్తూ జాబ్ విషయం కూడ వ్రాద్దామనుకుంటున్నాను. ఏదైనా అవకాశంవుంటే నన్ను రికమెండు చెయ్యమని......'

'పేపర్లోపడ్డ ఎడ్వర్టయిజ్‌మెంట్లకి అప్లైచెయ్యటం వుండనే వుంటుందనుకోండి...' తమ్ముడి మాటలని ముకుందం పూర్తిచేశాడు.

'ప్రైవేటు కంపెనీలలో అయితే త్వరగా పైకిరావచ్చు—కొన్ని పెద్ద పెద్ద కంపెనీలకి అప్లికేషన్లు పడేసి వుంచు—వేకెన్సీ వచ్చినప్పుడు వాళ్ళే పిలుస్తారు—మా వెవ్వా కొకడికి అలాగే దొరికింది...'

'నేనూ అదే అనుకుంటున్నాను' అన్నాడు సుందరం.

'అన్నట్లు ప్రకాశం ఈఏడు ఇంటరులో జాయిన్ అవుతాడు కాబోలు— ఏదయినా అతని చదువుగురించి సమస్యలేమీ వుండవు మీకు' అన్నాడు జగన్నాథంగారు.

'అదే మేమూ అనుకుంటూవుంటాం' అన్నాడు ముకుందం. సుందరం చిరునవ్వులో రవంత అతిశయం తొంగి చూసింది అతనికి తెలియకుండానే— ఆ తరువాత కాస్సేపు అవీ ఇవీ మాట్లాడి ఇంటికి వచ్చేశారు.

* * *

ఓ వుదయం అందరూ కూర్చుని కాఫీలుతాగుతూ ఏవేవో ఖబుర్లు చెప్పుకుంటున్నారు— గ్లాసులు ఖాళీ అయినా ఖబుర్లు తెమలలేదు.

వాకిట్లోంచి ఎవరిదో పిలుపు వినిపించి ముకుందం లేచివెళ్ళాడు. అతని వెనకే సుందరం ప్రకాశం కూడ దారి తీశారు.

తను తెచ్చిన కబురు అందించి వెళ్ళిపోయాడా వ్యక్తి.

'అమ్మా—' ముకుందం గావుకేక విసి

లేచి లేచి పరుగెత్తుకువెళ్ళింది. ఏమిటయి వుంటుంది అన్నట్లు అత్తా కోడళ్లు ఒక్కసారి మొహాలు చూసుకున్నారు. సుభద్రమ్మగారు లేచి వెళ్ల బోతూంటే ముకుందమే లోపలికివస్తూ అన్నాడు బాధగా. 'జగన్నాథంగారు పోయారుటమ్మా.'

'ఆ—ఎప్పుడూ—అసలెవరు చెప్పారు.' ఆ వార్త నమ్మలేనట్లు అడిగింది సుభద్రమ్మగారు.

'ఇప్పుడేట—వాళ్ల తాలూకు యెవరో వచ్చి చెప్పారు.' అన్నాడు సుందరం.

'జబ్బుగా వున్నట్లుకూడ వినలేదే—అవాళ మీరు వెళ్లినప్పుడు...'

'నిక్షేపంలా వున్నారు — చదువులని గురించీ, వుద్యోగాలని గురించీ, ఎంతసేపో మాట్లాడారు—ఏమిటో నిన్నకాక మొన్న చూసినట్లుంది...' అన్నాడు సుందరం.

'సరే—అవాళ్టి సంగతి ఏందుకూ—నిన్నరాత్రి కూడ హాయిగా భోజనంచేసి పడుకున్నారుట—ఉదయం ఆయన మామూలుగా లేచేవేళకి లేవకపోతే ఏమో నిద్ర పోతున్నారేమో లేపటం ఎందుకని వూరుకున్నారుట కాస్సేపు— తరువాత—చూస్తే ఏ ముంది వుత్తకట్టె — భ్రమ చావక డాక్టర్ని పిలుచుకువచ్చారుట...'

'అసలు ప్రాణమే లేనప్పుడు ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు.' అంది సుభద్రమ్మగారు నిట్టూర్చుస్తూ.

'మరి మనం వెళ్లివద్దాము.' అన్నాడు ముకుందం సుందరంతో.

'వాళ్లింటికేనా — నేనూ వస్తాను పదండి.' అంది సుభద్రమ్మగారు.

జగన్నాథంగారి భార్యకి నాలుగు ఓదార్పుమాటలు చెప్పి, పిల్లలకి కాస్త ధైర్యం చెప్పి, కాస్సేపు కూర్చుని వచ్చేసింది సుభద్రమ్మగారు.

'నువ్వా వెళ్లిపో' అని తమ్ముడ్ని కూడ ఇంటికి పంపేసి ముకుందం వాళ్లతో పాటు స్మశానందాకా వెళ్లి జగన్నాథం గారిపట్ల తమ కుటుంబానికి గల భక్తి గౌరవాలని వెల్లడించుకున్నాడు.

తిరిగివచ్చి స్నానం అదీ చేసేసరికి దగ్గర దగ్గర నాలుగు కావచ్చింది—ఉదయం ఎప్పుడో తాగిన కాఫీ తప్ప మళ్లీ ఏమీ తీసుకోలేదు — పైగా అంత దూరం వెళ్లిరావటం— అతనికి కళ్లు తిరుగుతున్నట్లుంది — కాళ్లు తేలిపోతున్నాయి — అయినా ఏమీ తినాలని పించలేదు.

'తనతో పది రోజుల క్రిందట నవ్వుతూ మాట్లాడిన మనిషి ఇవాళ లేడు—నిన్నటిదాకా శుభ్రంగా తిని తిరిగిన మనిషి ఇవాళ లేడు.' అనుకుంటూంటే అతనికెలాగో వుంది.

'ఈ మానవజీవితాలు ఎంత బుద్బుద ప్రాయమైనవి — ఏ క్షణానికేమౌస్తుందో ఎవ్వరికీ తెలియదు—' అనిపించింది.



తండ్రి పోయిన తరువాతనే ముకుం దానికి జగన్నాథంగారితో పరిచయం ఎక్కువయింది.—మాట పొయంగాని మరే సాయంగాని కావలసివచ్చినా చిటికి మాటికీ ఆయన దగ్గిరికే పరుగెత్తుకు వెళ్లేవాడు—కొండలా ఆయన అండ వుంది అన్న భావమే అతనికెంతో ధైర్యాన్ని ఇస్తూండేది—

అన్నం తినకుండా కళ్లు మూసుకుని మంచంమీద పడుకున్న కొడుకుదగ్గరికి వెళ్లి 'బొత్తిగా ఏమీ తినకుండా వుండ

కూడదు—లేచిరా— తెల్లవారి లేచిందగ్గర మంచి లోకంలో ఇలాంటి వెన్నో జరుగుతుంటాయి— ఎవరుమాత్రం ఏం చెయ్యగలరు — మనకి తెలిసినమనిషి కాబట్టి కాస్సేపు అయ్యో అనిపిస్తుంది—అంతే.' అంది సుభద్రమ్మగారు.

'ఎటూ కానివేళ నేనింకేమీ తినలేనమ్మా— ఏకంగా రాత్రికే భోజనంచేస్తా. మరి నన్ను బలవంతపెట్టకు.' అన్నాడతను అలా పడుకునే.

'పోనీ కాస్త మజ్జిగయినా తాగు' అని చెప్పి వెళ్ళి గ్లాసుతో మజ్జిగ తీసుకువచ్చి ఇచ్చింది.

నాలుగురోజులు గడిచిపోయాక ఓసాయంకాలం వెళ్ళి జగన్నాథంగారి కొడుకుల్ని కలుసుకుని మాట్లాడివచ్చాడు ముకుందం.

మరోవారంపూడా గడిచింది. ప్లీడరుగారి కర్మకాండ, దానాలు ధర్మాలూ అన్నీ అట్టహాసంగా ఖర్చుచేశారు కొడుకులు— వచ్చిన బంధువులు వెళ్ళిపోయారు.

అన్నిసంగతులూ తెలుస్తూనే వున్నాయి— వాళ్ళ అబ్బాయి పంపిస్తానన్న ఖబురుకోసం ఎదురుచూస్తూ మరో నాలుగు రోజులు గడిపాడు ముకుందం.

అవాళ ఆఫీసుకి వెళ్ళబోతూంటే, జగన్నాథంగారి గుమస్తా శివరామయ్య వచ్చాడు. 'ప్లీడరుగారు మిమ్మల్నొకసారి కనిపించమన్నాడు సాయంకాలం' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఇప్పుడు, ప్లీడరుగారంటే జగన్నాథంగారి పెద్ద కొడుకు రాజారావన్నమాట.

సాయంకాలం షాపునుంచి తిన్నగా అక్కడికే వెళ్ళి అతన్ని కలుసుకున్నాడు ముకుందం.

లోపలికి వస్తున్న కొడుకుముఖంలో దిగులు ఆందోళన పసిగట్టగలిగిన సుభద్రమ్మగారు విషయంకూడా వూహించుకోగలిగింది—అయినా అతను చెప్పేదాకా ప్రశ్నలతో వూదరగొట్టి దలచుకోలేదు.

ముకుందం మౌనంగా బట్టలు మార్చుకుని కాళ్ళూచేతులూ కడుక్కువస్తూంటే వంటింట్లోకి వెళ్ళి,

'ఆకూర నేను తరుగుతాను కానీ. ముందు అబ్బాయికి కాఫీ కలుపు' అంటూ కోడలిచేతిలో కత్తిపీట తీసుకుంది—

స్నేహితురాళ్ళు వస్తే ఖబుర్లు చెప్తూ వరండాలో వుంది శశి— ప్రకాశం ఇంట్లో లేడు—ఎక్కడికో వెళ్ళబోతున్న సుందరాన్ని.

'ఇలారా' అన్నట్లు సౌంజ్ఞచేసి వంటింటివేపు దారితీశాడు ముకుందం.

యశోదయిచ్చిన కాఫీగ్లాసు అందుకుని అక్కడే ఓ పీటమీద కూలబడ్డాడు. అన్నగారు ఏంచెప్తాడో వినాలన్న కుతూహలంతో గడపదగ్గరే నిలబడిపోయాడు సుందరం.

'ప్రొద్దుట జగన్నాథంగారి అబ్బాయి కబురు పంపించాడు. తెలుసుకదా...' అని అతనంటుంటే 'వెళ్ళావా—ముందు కాఫీ తాగు తరువాత ఖబుర్లన్నీ చెపుదువుగాని' అంది సుభద్రమ్మగారు.

స్నేహితురాళ్ళని పంపించి లోపలికి రాబోయిన శశి అందరిమొహాలూ అతి ముఖ్యవిషయం చర్చిస్తున్నట్లుగా వుండటం గమనించి మెల్లిగా గదిలోకి వెళ్ళిపోయింది.

'వాళ్ళు ఆస్తి వ్యవహారాలన్నీ పరిష్కారం చేసుకుంటున్నారుట — మనం ఇవ్వాల్సిందేదో వెంటనే సర్దుబాటు చేసేస్తేనే బాగుంటుందన్నట్లు చెప్పాడు.' అని ముకుందం అంటూంటే.

'ఎంతివ్వాలి.' అన్నాడు సుందరం.

'నాలుగువేల పైచిలుకే...'

సుభద్రమ్మగారికేమంత ఆశ్చర్యం అనిపించలేదు కాని యశోదా, సుందరం వులిక్కిపడ్డట్లే అయ్యారు.

ఇలాంటి వ్యవహారాలు ముకుందం భార్యతో సంప్రతించటంకాని, మాటవరసకి ఆమె చెవిని వెయ్యటంకాని జరగలేదింతవరకూ—యశోదయినా తనంతట తను అన్నింటిలోనూ తలదూర్చి జోక్యం కలిగించుకోలేదు—ఇవాళ హఠాత్తుగా తను పరిస్థితి అర్థం అయేసరికి ఎలాగో అనిపించింది — అయినా పెదవి విప్పి ఏ మాటా అనలేదు—

సుందరం పరిస్థితి అంతకన్నా అయోమయంగా వుంది—తన కెలాంటి ఇబ్బందీ కలగకుండా నెల నెలా అన్నగారు డబ్బు పంపిస్తూంటే అందుకుని నిశ్చింతగా ఖర్చు పెట్టుకోటమేకాని ఇక్కడి పరిస్థితులు పూర్తిగా అతనికి తెలియనే తెలియవు. ఇంత అప్పు వుంటుందనే వూహకూడా అతని కెప్పుడూ రాలేదు.

'సమయానికి చేతిలో డబ్బు లేక పోయినా ఇక్కడా అక్కడా తెచ్చి సర్దుబాటుచేసి పంపించినందుకు పది మందిలో మా మాట దక్కించావు.' అని అవాళ తల్లి అన్నమాటలు గుర్తు వచ్చాయి. 'నేను కాకపోతే మరో యల్లయ్య—ఊళ్లో మరి డబ్బే పుట్టదన్నట్లు మాట్లాడతారేమిటి.' అని జగన్నాథంగారు అనటం గుర్తు చేసుకున్నాడు— అతనికి పరిస్థితంతా అర్థం అయిపోయింది.

'బాగా వున్నవాళ్ళం కాదు అని తెలుసుకొని మన పరిస్థితి ఏమిటో పూర్తిగా గ్రహించుకోలేక పోయాను—నా చదువుకి నాలుగు వేలు అప్పు అయింది అని అనుకుంటూంటే నా కెంత బాధగా సిగ్గుగా వుందో...' అపరాధిలా తల వంచుకున్న తమ్ముడిని చూస్తూ అనునయంగా అన్నాడు ముకుందం. 'నయమే— ఈ అప్పంతా నీ చదువుకోసమే చేశాననుకుంటున్నావా. అదేంకాదు— ఇంట్లో ఎన్నో ఖర్చులకి అవసరం వచ్చినప్పుడల్లా ఆయన దగ్గర తీసుకుంటూండే వాడిని—శకుంతల పెళ్ళికి పొలం అమ్మినా డబ్బు తక్కువ పడింది—ఆ తరువాత పండగలనీ నోముకలనీ సీమంతమనీ బాలసారె అనీ ఏవేవో ఖర్చులు వచ్చాయి—మనకేవో ఇబ్బందులున్నాయని అన్ని సరదాలూ మానుకుని ఆడపిల్లని చిన్నబుచ్చలేం కదా మరి — సరే పొలం ఒకటే బాగు చేయించాం...'

'అక్కడికీ ఆయన వడ్డీ ఏమీ లేకుండానే ఇచ్చేవాడు.' అంది సుభద్రమ్మగారు.

'అదే—అప్పుడు నాన్నగారు పోయిన క్రొత్తలో తీసుకున్న డబ్బు రెండేళ్ళలో తీర్చేశాను అనుకో—'ఇప్పుడు తీసుకోటమే కాని తీర్చటం కనిపించటంలేదు— ఏదో ఇంత వడ్డీ అదీకూడా అనుకుంటే బాగుంటుంది.' అన్నాను ఓ సారి ఆయనతో— అందుకాయన వింతమాత్రం ఒప్పుకోలేదు— 'ఇబ్బంది వచ్చినప్పుడు తీసుకుంటున్నావు, రేపు చేతిలో వున్నప్పుడు తీర్చేస్తావు — ఈ భాగ్యానికి నీ దగ్గర వడ్డీలు చక్రవడ్డీలు వసూలు చేయమంటావా' అనేవారు—అంతే కాదు ఏ నాడూ నోటూ పత్రంలాంటివేమీ రాయించుకోలేదు — డైరీలో రాసుకునే

# ఒకే ట్యూబుతో ఐదు రకాల ఫినిష్‌లు!

□ వివిధోపయుక్తమైనది—ఒక ట్యూబును వివిధ ఏప్‌కొలైట్ బేస్ పెయింట్లతో వాడవచ్చును. వెంటనే మీకు నచ్చిన ఫినిష్‌లు—అద్దము వంటి మెరుగు, మందమైన మెరుగు, మేట్ (తళతళలాడని) మెరుగు, హేమర్, మెటాలిక్ వంటి ఫినిష్‌లు—వస్తాయి.

□ వీటికి ఏప్‌కొలైట్ బేస్ పెయింట్లను ఎంచుకోండి: సింథటిక్ ఎనామిల్, అక్రిలిక్ ఎమల్షన్, డెకోప్లాస్ట్ వాల్ ఫినిష్, సింథటిక్ మేట్, హేమర్ మరియు మెటాలిక్ మరియు అక్రిలిక్ వాషబుల్ డిస్‌టెంపర్.

□ కావలసిన రంగు తక్షణమే తెచ్చేది మేజిక్‌టచ్.

## మేజిక్‌టచ్

కావలసిన రంగును తక్షణమే తెచ్చేది




ఎక్కడ రంగు కావలెనో
అక్కడ
ఏషియన్ పెయింట్స్



**ఏషియన్ పెయింట్స్**

LFE-AIYARS, A. 1924 TEL

వారి గుర్తుగా అంతే...'

'నాన్నగారిమీద ఆయనకుండే అభిమానం వల్ల మన కుటుంబానికేదో ఆ మాత్రం సాయం చేశారాయన—కొడుకులకి కూడ ఆ అభిప్రాయమే ఎందుకుంటుంది—పెత్తనం పిళ్ళ చేతిలోకి రాగానే డబ్బు ఇమ్మని కూర్చున్నారన్నమాట —' అన్నాడు సుందరం కాస్త వుడుకుమోత్తనంగా — మన అవసరాలు నిస్సహాయత ఒక్కొక్క సారి ఎదుటి వారిలో తప్పు వెంచాలని చూస్తుంది—సుందరం ఆవేశపడుతుంటే ముకుందం మెత్తగా మందలించాడు. 'అలా అనుకోటం ఎందుకు— వాళ్ళకేం ఖర్చులున్నాయో—అతను అడిగినందుకు నేనేమీ అనుకోటం లేదు కాని ఎలా తీర్చటమా అనే ఆలోచిస్తున్నాను.'

'పోని మీ విశ్వనాథంగారిస్తారేమో — అప్పుడెప్పుడో అన్నారన్నావుగా...' ఆశగా కొడుకు మొహంలోకి చూసింది సుభద్రమ్మ. యాభయ్యో వందో అయితే ఇచ్చి — ఓ నెలో రెండునెలలో ఆగుతారు కాని వేలకివేలు అప్పు ఇచ్చి సంవత్సరాల తరబడీ ఆగటం వాళ్ళకి వీలుకాదమ్మా— వాళ్ళు చేసే వ్యాపారంలో ఇంత పెద్ద మొత్తానికి ఎంత విలువ వుంటుందో, అది పెట్టుబడిలో పెడితే ఎంత లాభం వస్తుందో నాకు తెలుసు—ఒక్కొక్కసారి వాళ్ళకే చటుక్కున అవసరం పడితే ఏ బ్యాంకినుంచో తెచ్చుకుని మళ్ళీ తీర్చేస్తూ వుంటారు — ఇంక అన్నీ తెలిసి కూడ ఆయన్ని అడగాలంటే నాకు నోరు రాదు— అది న్యాయం కూడ కాదు.'

'మరేం చేద్దామంటావు.'

'నాకేమీ తోచటం లేదు — సుందరం నువ్వు కూడ ఆలోచించు — పెద్దవాడివయ్యావు పరిస్థితులన్నీ నీక్కూడ తెలిస్తే బాగుంటుంది అన్న వుద్దేశ్యంతోనే నిన్నూ పిలిచాను.'

'చెయ్యటానికింకో మార్గం ఏముంది— మళ్ళీ ఎంతో కొంతపొలం అమ్మేయాలి' అంది సుభద్రమ్మగారు ఎటో చూస్తూ.

'అదే నా బాధ— మేం సంపాదించుకోటం మాట అలా వుంచి నాన్నగారు కష్టపడి నిర్వాకం చేసిందికూడ నిలుపుకోలేకపోతున్నాం.' దీనంగా చూశాడు ముకుందం—పెత్తనం చేపట్టవంటూ

# ఆశలా? అనుభవాలా?

తయారయి కాస్త కాస్త ఆస్తి కరుగబెట్టడమే తన చేతుల మీదుగా జరుగుతోందని అతని మనస్సు విలవిల్లాడిపోతోంది.

'గత్యంతరం లేనప్పుడు ఎవరుమాత్రం ఏం చెయ్యగలరు — చేతిలోవున్నవాడు దుబారా చెయ్యకుండా ఆస్తులూ అవీ ఏర్పరచుకున్నారు. ఈనాడు అవసరంలో అవి మనల్ని ఆదుకుంటున్నాయి అనుకుందాం — అయినా, చదువులకీ, శుభకార్యాలకీ ఇంటి అవసరాలకీ ఖర్చయిందేగాని మీరెవరూ అల్లరిచిల్లరిగా తిరిగి డబ్బు పాడుచెయ్యలేదు—అదొక్కటే నాకు తృప్తి—' మనస్సు ఎలాగో అయిపోతున్నా పైకి మాత్రం ధైర్యంగానే మాట్లాడింది సుభద్రమ్మగారు.

చివరికి అదే నిర్ణయంమీద నిలబడ్డారు అంతా.

* * *

ఇంటోవాళ్ళ మొహం చూడాలంటేనే సిగ్గుగావుంది సుందరానికి—'ఈ పంపించిన అప్లికేషన్లన్నీ ఏ గంగలో కలిసిపోయాయి. ఒక్కడిదగ్గరనుంచి సమాధానం రాదేమిటి.' అని తనలో తనే విసుక్కుంటూండేవాడు.

పైకి చెప్పుకోకపోయినా అతనిబాధ అందరికీ అర్థం అయిపోయింది—ఇంకా ప్రశ్నలువేసి విసిగించి అతన్ని చిన్నబుచ్చటం ఇష్టంలేక సుభద్రమ్మగారు, ముకుందం అతని ప్రయత్నాల గురించి తరిచితరిచి అడగటం మానేశారు.

చివరికి అతని నిరీక్షణ ఫలించింది— మద్రాసునుంచి ఓ ప్రైవేటు కంపెనీ నుంచి ఇంటర్వ్యూకి పిలుపు వచ్చింది—

'ఇంటర్వ్యూ వస్తే వుద్యోగం వచ్చినట్లేనా ఏమిటి—ఇలాంటి ఖర్చు ఇంకా ఎంతవ్వాలో.' అనుకుంటూ బట్టలు సర్దుకుంటున్న అతనికి ధైర్యం చెప్పి రైలు ఎక్కించాడు ముకుందం.

సుందరం తిరిగి వచ్చిన ఇరవై రోజులకే వుద్యోగంలో చేరమంటూ ఆర్డరు చేతికి వచ్చింది.

ఆతను పరీక్ష ప్యాసయినప్పటికంటె మిన్నగా అందరి మొహాలు కళకళలాడాయి.

'మరిదిగారు పెద్ద వుద్యోగస్థులై మమ్మల్నందర్నీ మరిచిపోతారేమో—' అంటూ యశోదకూడ కాస్త చొరవచేసి హాస్యం ఆడింది.

'అలాగే చూస్తూవుండు' అని సమాధానం చెప్పాడు సుందరం కనుబొమలు ఎగురవేస్తూ.

'నీ సంపాదనలో వదినకో మంచి బహుమతి కొని యియ్యి పోనీ.' ప్రకాశం సలహా ఇచ్చాడు.

'బహుమతులూ అవీ చెల్లెళ్ళకే ఇచ్చుకోనీ—నన్ను కాస్త గుర్తు వుంచుకుంటే చాలు.' అంది యశోద వూరుకోకుండా.

'అదుగో—అలా వేరుచేసి మాట్లాడితేనే నాకు కోపం వస్తుంది—చెల్లెళ్ళయిలు ఒకటే నువ్వు వకటే కాదు నాకు— అంతా సమానమే—' కయ్యానికి సిద్ధమయాడు సుందరం.

'తను వరాయిచోటునుంచి వచ్చింది కదూ—ఆ సంగతి మరిచి పోలేకుండా వుంది పాపం.' అంటూ ముకుందం భార్యని వుడికించాడు — యశోద ఏదో అనబోతూంటే, 'ఇదుగో — ఇప్పుడంటే అన్నావుగాని మరెప్పుడూ ఆ మాట అనకు —యశోద గుణం నీకంటె నాకే బాగా ఎక్కువ తెలుసు' అని కోడల్ని వెనకవేసుకు వచ్చింది సుభద్రమ్మగారు.

'ఓ యబ్బ — కోడలిమీద ఈగవాలనివ్వదు మా అమ్మ,' వెక్కిరించింది శశి.

అంతా సరదాగా నవ్వుకున్నారు.

ఒకనెల గడచింది—తమ్ముడి సంపాదనలోంచి పంపించిన డబ్బు మొదటిసారిగా అందుకుంటూంటే ముకుందం చేతులు వణికాయి—ఆనందాతిరేకంతో కళ్ళు చెమర్చాయి. 'నాభారం పంచుకోటానికి తమ్ముడు చేతికి అంది వచ్చాడు. ఇంకేం ఫరవాలేదు.' అనిపించింది.

'తను ఇన్నాళ్ళనుంచీ వుద్యోగం చేస్తూనే వున్నాడు— అయినా,

'ఏం సంపాదనో ఏం ఖర్చులో—ఒకటో తారీఖున జీతం అందుకుంటే ఇరవైయ్యో తారీకు రాకుండానే జేబులు ఖాళీ అయిపోతున్నాయి ... అదేమిటో మరి, నెల మొదట లెఖ్ఖలు వేసుకుంటే దేనిదే అంతా సరిపోయినట్లే వుంటుంది—తీరా రోజులు గడుస్తూంటె ఏవో మరిచిపోయిన ఖర్చులు గుర్తుకు వస్తాయి. అనుకోని

ఖర్చులువచ్చి ఎదురుగా నిలిచి మమ్మల్నేం చేస్తావు అని అడుగుతున్నట్లుగా వుంటుంది—ఇంక ఇప్పుడా బాధ లేదు.' అనుకున్నాడు.

* * *

పనులన్నీ తెముల్చుకుని రాత్రి పది గంటలవేళ పడక గది చేరింది యశోద—గదిలో పెద్ద లైటు వెలగటం లేదు—ట్రాన్స్‌ఫార్మర్ బల్బు కాంతి పలచగా గది నిండా పరుచుకుని వుంది. 'ఇవాళ పుస్తకాలేం ముందువేసుకుని కూర్చోలేదు ఈయన గారు,' అనుకుంటూ మంచినీళ్ళ కూజా గోడవార పెడుతూ భర్తవేపు చూసింది.

మెడదాకా దుప్పటి కప్పుకుని మంచం మీద అటు తిరిగి పడుకున్న ముకుందం మనిషి లోపలికివచ్చిన సవ్వడికికూడా ఇటు తిరగకపోవటంతో అతను అప్పుడే నిద్రలో మునిగిపోయాడని గ్రహించుకుంది. తలుపులు గడియవేసి తనూ నడుం వాల్చింది.

'రేపు కాస్త తెల్లవారేదాకా పడుకోవచ్చు—హడావిడేం లేదు' అనుకుంటూ దుప్పటి కంఠందాకా లాక్కుంది—ఇప్పటికి పదిహేను రోజులకి పైగా అంటే సుందరం పెళ్ళికి ముహూర్తం పెట్టిన దగ్గరనుంచి యశోద ఊపిరి సలపని పనులతో ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది— క్షణం తీరికలేదు, కరువుదీరా నిద్రలేదు.

లగ్నం రేపనగా అంతా ఆడపెళ్ళివారి వూరికి తరలి వెళ్ళారు—మళ్ళీ మూడో నాటికి పెళ్ళికూతురితోసహా తిరిగివచ్చారు బంధువులంతా అటునుంచి వెళ్ళిపోతారేమో అనుకుంది యశోద—కాని ఇక్కడ నుంచి ప్రత్యేకంగా కుదుర్చుకుని వెళ్ళిన బస్సు వుండటంవల్లనో ఏమో మళ్ళీ అంతా ఇక్కడికే వచ్చారు— రెండురోజులు అన్ని వేడుకలూ అయ్యాక ఒక్కొక్కరే పెట్టెలు సర్దుకుని తిరుగు ప్రయాణం అయ్యారు. ఈ వుదయంతో వచ్చిన వాళ్ళంతా వెళ్ళిపోయినట్లే— మధ్యాహ్నం బండిలో పెళ్ళికూతురూ ఆమెతోవచ్చిన బంధువులూ వెళ్ళిపోయారు— అక్కడ మూడు నిద్రలకి పెళ్ళికొడుకు అతనివెంట శకుంతలా శశి కూడ వెళ్ళారు—ఇంక ఇంట్లో మిగిలిన మనుష్యులు నలుగురే కాని సర్దుకోవలసిన సామానుమాత్రం చాలానే వున్నాయి—అవన్నీ సవరించుకునేసరికే ఈవేళ అయింది.

'అలావుంటూనే వుంటాయి—రేపు చూసుకుందాంలే—ఇంక వెళ్ళిపడుకో' అని కోడలికి చెప్పి అరగంటక్రిందటే తన గది వేపు వెళ్ళిపోయింది సుభద్రమ్మగారు—పాపం ఆవిడా అలసిపోయింది.

'ఆ...అయిపోయింది' అంటూనే మరి కాస్సేపు అవీ ఇవీ సర్ది స్టోరుగదీ, వంటగదీ గడియపెట్టి వచ్చింది యశోద.

అలిసిపోయిన శరీరానికి విశ్రాంతి దొరకగానే కళ్ళమీదికి నిద్ర ముంచుకు రావలసిందే—అసలు విశ్రాంతి దొరకగానే అని ఏమిటి ఆ హడావిడి రోజులలో ఎలా కూర్చున్నది అలాగే ఆగోడ నానుకుని కాస్సేపు కళ్ళు మూసుకుని నిద్రపోతే బాగుండును అనిపించిన సందర్భాలు కూడ వుండేవి—అలాంటిది ఇవాళ ఇంత తీరుబడిగా పక్కమీద పడుకుని వెచ్చగా దుప్పటి కప్పుకున్నా కళ్ళు మూతపడటం లేదు—కావాలని మూసుకున్నా కళ్ళు మంటలు పుడుతున్నాయే కాని నిద్రమాత్రం రావటం లేదు—ఇన్నాళ్ళూ మనస్సులో రగులుతున్న ఆలోచనలూ సంఘటనలూ అన్నీ కలిసి కట్టుగా గుర్తువచ్చి మనస్సుని చికాకు పెడుతున్నాయి... 'తనూ రమణీ ఒక్క యింటికోడళ్ళే — కాని [illegible] మాత్రం చాలా వ్యత్యాసముంది—అసలా అమ్మాయి మొదటినుంచీ అదృష్టవంతురాలే' అనుకుంది.

రమణి తండ్రి జిల్లాజడ్జీగా పనిచేసి రిటైరయి ఈ మధ్యేకాలం చేశారు — ఆయనకి ముగ్గురు కొడుకులు ముగ్గురు కూతుళ్ళు— అందరిలోకీ ఆఖరిది రమణి—

'మిగిలిన అందరి పెళ్ళిళ్ళు పేరంటాలూ నాచేతి మీదుగా అట్టహాసంగా దర్జాగా చేసుకున్నాను — ఈ కడసారదాని కళ్యాణాన్ని మాత్రం చేసుకునే యోగం లేదేమో నాకు.' అనిపించింది ఆయనకి. జబ్బుచేసి మంచం ఎక్కటంతోటే—తరువాత ఎవ్వరూ ఏలాంటి గొడవలూ పడకుండా తను వుండగానే అన్నీ ఏర్పాట్లూ చేస్తే బాగుంటుందనే అభిప్రాయంతో ఆ రోజుల్లోనే విల్లు కూడా వ్రాసేశారాయన — అన్నదమ్ములు కట్నం ఇవ్వటానికి వెనకాడి ఏ నాసి రకం సంబంధమో తెస్తారేమో అనే వుద్దేశ్యంతో రమణి పెళ్ళి ఖర్చులకి ప్రత్యేకంగా కొంత డబ్బు వ్రాశాడు—

తను వాటాలోంచి తీసి ఖర్చుపెట్టాల్సిన అవసరం లేకపోవటం వల్ల, కట్నానికి వెనక తియ్యకుండా పెద్ద సంబంధాలే వెతికారు రమణి అన్నగార్లు — ఏ కారణం వల్లనయితేనేం అవి కలిసి రాలేదు.

(ఇంకావుంది)



# వాన వెలిసింది

కె. రామలక్ష్మి






నయాగరా జలపాతపు సొంపుసొంపులూ అందచందాలూ వివరించి చెప్తూ చివరికి గైడు ఆగి ఎప్పుడూ హెచ్చరిస్తాట్ట — కొంచెంసేపు మీ ఆడవారు మాట్లాడ్డం మానేస్తే జలపాతపు హోరు కూడా విని ఆనందించవచ్చు'నని! ఇదేదో అతిశయోక్తి అని కొట్టి పారేయకండి...కొంచెం చెవి ఒగ్గి వింటే ఆ గైడు మాటల్లో అబద్ధం ఉండదేమో అనిపిస్తుంది ... నలుగురాడువారు కలిసి కబుర్లు చెప్పుకోవడం ప్రారంభిస్తే — చుట్టుపక్కల గొడవలేం వినిపించక పోవడం అందరికీ అనుభవమే.

కూర్చుని కబుర్లు చెప్పుకోవచ్చు. కష్టసుఖాలు కలబోసుకోవచ్చు. రహస్యాలు పంచుకోవచ్చు. ఎవరూ వద్దనరు. కాని అవి రోడ్డుమీదనైతే ట్రాఫిక్ జామ్‌కీ, ఇంట్లో అయితే ఇతర ప్రమాదాలకీ దారి తీయకూడదు. కబుర్లలో పడి పెనం కాలేసి మరిచిపోయినా గాస్ మూయడం అశ్రద్ధ చేసినా 'అయ్యో నా మతిమండా' అని తరువాత బాధపడితే ప్రయోజనం ఉండదు కదా...ఏ వంటవాడో పెనం ముట్టుకోకా మానడు. స్నేహితులు కాస్తా వెళ్ళిపోయాక గాస్ అలుముకున్న కిచెన్‌లో కామని మూర్ఛపడకా తప్పదు!

నేరోజూ చూస్తూ ఉంటాను — నడివి గుంపులు గుంపులుగా వెళ్ళే విద్యార్థినులని, నీళ్ళకి వచ్చి కబుర్లు చెప్పుకొనే మామీలని, మిల్లు దగ్గర పిండి పట్టిస్తూ మాట్లాడే ముత్తయిదువులని; రోడ్డుకడ్డం తిరిగి 'మించినన్ దొరకదూ' అన్నట్టు మాట్లాడుకుంటారు అమ్మాయిలు. పోనీ అంటే ఒకళ్ళు ఏం చెప్తున్నారో ఇంకొకరికి అర్థమవదు. ఎందుకంటే మధ్యలో ఇంకో నోరు చెప్తూ ఉంటుంది. ఇలా ఈ క్రాస్‌టాక్‌లో జరిగిన సంభాషణ సారాంశం చెప్పమని ఓ అమ్మాయిని అడిగితే నవ్వేసి ఊరుకుంది. పైగా, ఏమనుకుందంటే 'అలా మాట్లాడ్డం సరదా' అంది! 'రోడ్డుమీద అందరూ తిరిగి చూసేలా అలా ఊర పిచుకల్లా కిచకిచలాడ్డం సరదా ఏమిటిషీ నా ముఖం' అంటే నేనో పాతరాతి యుగపు మనిషి కింద కనిపిస్తానేమో! ఎందుకొచ్చిన గొడవ.

కుళాయి దగ్గరకి నీళ్ళకి వచ్చిన వాళ్ళా అంటే క్యూలో ఆటోమేటిక్‌గా బిందె జరుపుతూనే కబుర్లు సాగిస్తారు. ఆ కబుర్లలో 'ఇవి నలుగురూ వినవచ్చా విన కూడదా, మనం ఈ సంగతి ఈవిడగారితో ఎందుకు చెప్పడం?' అన్నవేమీ ఆలోచించరు. విస్సార్త్రి భర్తగారు పడక గదిలో చేసిన జోకు దగ్గర నుంచి అత్తగారెలా కారాలూ మిరియాలూ నూరుతారో ఆడబడుచులెలా దోచేస్తున్నారో కొత్తచీర కట్టుకుంటే పక్కింటావిడెలా కళ్ళలో నిప్పులు పోసుకుందో...అన్నీ సాగిపోతాయి ఇందులో ఇంకో విచిత్ర

డాక్టర్ కబుర్లు

## సబ్బు - కొన్ని ప్రమాదాలు

సబ్బు పెట్టెలో చిన్నదవుతున్న కొద్దీ ముద్దగా తయారవుతూ ఉంటుంది. ఈ ముద్ద వల్ల క్రిములు పాకవచ్చు.



సబ్బు క్రిములని చంపదు, కడిగి వేస్తుంది. కొన్ని రకాల సూక్ష్మ క్రిములు సబ్బుమీద దట్టంగా పెరుగుతాయి. వీటిని స్టాఫ్లో కోక్కియ్ అంటారు, ఇవి వంటిమీదంతా ఉంటాయి. కొన్ని సమయాలలో వీటివల్ల కురుపులు, మొటిమలు లేస్తాయి.

ఇవి స్పర్శసంబంధమయినవి. వాటిని ఎవరూ తప్పించుకోలేరు. వాటివల్ల బాధ కలిగే వారు తమ తుమ్ములని రుమాలలోకి 'పంపాలి'; వీలయితే కాగితం రుమాలలు వాడి పారెయ్యాలి; వంటసామాను, కంచాలు, గ్లాసులని వేడినీటితో కడగాలి; చేతులని తరచు కడుక్కోవాలి; వీలయితే కాగితం తువ్వాల వాడాలి.

డాక్టరుని సంప్రదించటం మంచిది.

హెచ్. ఎల్. హార్ట్సన్‌సోన్

(కాపీరయిటు)

# మాడుపట్టిలో స్విస్ ఆంబోతులు



రు. **20,000** ఖరీదుచేసే 800 కిలోగ్రాముల బరువుగల గోధుమరంగు స్విస్ ఆంబోతు.

మున్నార్ కేరళలో ఒక కొండమీద ఊరు. ఇక్కడ టీ, కాఫీ ఎస్టేట్లు చాలా ఉన్నాయి. వీటి మధ్య, మున్నార్‌కి సుమారు ఎనిమిది మైళ్ళ దూరంలో మాడుపట్టిలో పశు అభివృద్ధి కేంద్రం ఒకటి ఉంది. ఇది అంతర్జాతీయంగా పేరు పొందినది అనవచ్చు. దీనిని స్విట్జర్లాండ్ వారి సహాయంతో ప్రారంభించారు.

పశు అభివృద్ధికి ఈ చోటు నేదెందుకు ఎన్నుకున్నారు? ఇది పర్వత ప్రాంతం కాబట్టి, చుట్టుపక్కల మంచి మేత ఉంది కాబట్టి.

ఈ కేంద్రంలో మంచి జాతి పశువులని అభివృద్ధి చేస్తారు. మనకి కావలసిన పశువులు ఎన్నో విధాలుగా పనికి రావాలి. పొలం దున్నటానికీ, పాలకీ కూడా పశువులు పనికి రావాలి!

స్విట్జర్లాండ్‌లో బ్రవున్‌స్విస్ అనే జాతి ఆంబోతు ఉంది. ఇటువంటి ఆంబోతులు 15 తీసుకువచ్చి 150 ఆవులతో సంపర్కం ఏర్పరిచారు. ఈ ఆవులన్నీ ప్రాంతీయమయినవే.

ఈ విధంగా పుట్టిన సంతతికి తిరిగి బ్రవున్ స్విస్‌తో సంపర్కం ఏర్పరిచారు. ఇదే పద్ధతిని అనుసరించి సుమారుగా 8 లో 5 భాగాలు బ్రవున్‌స్విస్ ఉండే జాతిని సృష్టించారు. సృష్టిస్తున్నారు. ఈ జాతి భారతీయ వాతావరణానికి సరిపోతుందని నిపుణుల అభిప్రాయం. ఈ జాతికి కృత్రిమంగా చూలు వచ్చేట్లు చూస్తారు. ఇటువంటి జాతిఆవు ఒకమారికి సుమారు 3000 కిలోగ్రాముల పాలు ఇస్తుంది. ఈ జాతిని ఇంకాకూడా అభివృద్ధి చెయ్యవచ్చు.

ఈ పశు కేంద్రంలో ఆంబోతుల శుక్లాన్ని కొన్ని సంవత్సరాలదాకా భద్రపరిచే సౌకర్యాలు ఉన్నాయి. అవసరమయినప్పుడు దానితో ఆవులకి గర్భధారణ ఏర్పాటు చేస్తారు.

ఒక స్విస్ ఆంబోతువెల–రు. 20,000

ఇటువంటివి ఇక్కడ 15 ఉన్నాయి. ఇవికాక ఆవులు 44 ఉన్నాయి. ఎన్నో మిశ్రమజాతివి ఉన్నాయి. వీటన్నిటికీ ఆహారం ఏర్పరచాలి. అందుకోసం కొత్త రకం గ్రాసాలని అభివృద్ధి చేసి ఎదిగిస్తున్నారు. జొన్నలు, బార్లీ, పొద్దుతిరుగుడు పువ్వు మొదలయిన వాటిని కూడా పుష్కలంగా పండిస్తున్నారు ...

ఫొటోలు, వ్యాసం :
ఎస్. రామకృష్ణ



విద్యుత్ కంచెలోపల ప్రత్యేకంగా పెంచిన పచ్చిక బీడులో మేస్తున్న పశువులు.



ఇండియాలోని గోధుమవన్నె స్విస్ ఎద్దుకి పుట్టిన రు. **15,000** ఖరీదుచేసే స్విస్ ఆవు.





# మసగ నవ్వులు మంచు పువ్వులు

శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావు

డాల్ సరస్సు అంచులో మంచుకొండ చరియలో నిర్మించిన నీలగగన్ హోటల్ విదేశయాత్రికులనెంతో ఆకర్షిస్తుంది— అతి గర్వంతో తన నీడను, సరస్సులో చూచుకొంటూ కెరటాల మీద వూగుతున్న ఆ హోటల్‌లో విడిది చేయడమే గొప్ప అదృష్టంగా భావిస్తారు విలాసయాత్రికులు.

ప్రకృతి సౌందర్యాన్నంతా గుండెల్లో కుక్కుకొని, ఉత్సాహంతో ఉక్కిబిక్కిరి అయి 2వ రోజు సాయంత్రం నీలగగన్‌కు చేరారు రమేష్, కిశోర్ లిద్దరూ. చెరో గదితీసుకొని వుంటున్నారు. రాగానే స్నానం చేసి చక్కటి దుస్తులు ధరించి కూర్చున్నాడు రమేష్. కాశ్మీర్ సౌందర్య ప్రకృతి అంతా అతని మనస్సులో ఒక్కసారి పరచుకొన్నట్లయింది.

కుంకుమ పువ్వు మాగాణిలో వంపు తిరిగిన బాటల్లో విహరిస్తుంటే నివింపుల అడుగుజాడల్లో తను సంచరిస్తున్న ఆనందం కలిగిందతనికి. డాల్ సరస్సులో పూల నావలో విహరిస్తుంటే యదుద్వహుడు యమునలో చేసిన నౌకా విహారం అతని మనస్సులో మెదిలింది. ఆయన రూపంతో ఆ సరస్సు కదిలినట్లనిపించింది. వేణువు మాత్రం వినిపించలేదు. కాని తను ఆ గానాన్ని ఊహించుకొని ఉత్సాహపడ్డాడు. ఇలాటి అనుభూతులు ఎన్నెన్నో అతనిలో మెదిలి అద్భుత భావపరంపరకు అనుకూల స్థితి కల్పించినాయి.

ఇంతలో కిశోర్ అక్కడికి వచ్చాడు. ఇద్దరూ భోజనం చేశారు. రమేష్ మనస్సులో ప్రకృతి సౌందర్యం జారపోని ఇంద్రధనుస్సులా మెరుస్తూంది. అతడు చూచి వచ్చిన ఆరామ సౌందర్యం తలుచుకొంటూంటే—ఒక్కొక్క పొదరిల్లొక మయూరమై, ఆ ఆరామమంతా ఆడనెమలుల గుంపులాడుతూ తలలూపిన దృశ్యం మనోఫలకం మీద చిత్రితమైంది.

బల్లమీద వున్న యాపిల్‌పండు తీసి దానివంక తదేక దృష్టితో చూస్తున్నాడు. దానిలో అతని ముఖం కనిపిస్తోంది. ఆ ముఖంలో అతని గోల్డ్‌ఫ్రేము కంటి అద్దాలు మరింత స్పష్టంగా కనిపిస్తున్నాయి. తన నేత్రాలకు ప్రాధాన్యమిచ్చిన ఆ యాపిల్‌పండు ఎరుపురంగును అభినందించాడు లోలోపల.

'రమేష్ ! ఎంత అందంగావుంది ఈ ప్రాంతం ?' ఇంతకాలం చూడకపోయినందుకు చింతగావుంది.' అన్నాడు కిశోర్!

'ప్రాప్తం వుండాలి' అన్నాడు రమేష్ ఆలోచనా పూర్వకంగా.

'కుంకుమపువ్వు మాగాణి ప్రక్కగా ఒకగోవును మేపుతున్న కోమలిని చూచి వుంటావు. పలకరిద్దామనుకొంటుండగానే పకపకలాడి పాటపాడుతూ గంతులువేసింది. ఆ కాలిమువ్వల గలగల ఇంకా నావెవిదగ్గర

## లిట్‌క్విజ్ నెం 55 – 18 క్లూలు

1. జీవనమందు సంశయములు అనేకం. అంతే ఒక్కటిమాత్రం నిశ్చయంగా గలదు **మృత్యువు/సత్య బోధ.**

2. మన భావనలను అదుపుచేయుట గుప్తపరచుట, శోధించుట, **కాదనుట/విధ్వంసనం వరకు** సహితం మనకు నేర్పబడింది.

3. సువిచారత సుసజ్జ మరియు వికసిత మనస్సు ఎన్నటికీ **ఉదాసీనతా/నిష్క్రియతా** వశంకాదు. లేక ఒకప్పుడు కావచ్చు.

4. ప్రతినవ్య సమాజమందును **విధ్వంసకుల / సర్వాధికారుల** బారినుండి రక్షించుకొనే శక్తి వుండవలెను.

5. జీవన పరిమాణము తుదకు దాని అవధి కాదు కాని దానినిష్ఠా/**దానాము** అయి వున్నది.

6. భాగ్యాశ్రయం, అత్యాత్మ విశ్వాసం, అత్యధికకార్యాచరణాయత్నం భావప్రేరిత/**నైతికశక్తి** లేశం—ఇవన్నియు స్వీయాభివృద్ధి శ్రమలోవాడుకైన సామాన్యబాధలే అయివున్నవి.

7. మనలో ప్రతి ఒక్కరికి ఒక **లక్ష్యం/దైవం** చేతన లేక అచేతన రూపంలో వుండుట నిక్కము.

8. అనివార్యంగా స్వీయ **ఆనంద/సఫలత** ఇచ్ఛతో మానవఆకాంక్ష జోడించబడివుంటుంది.

9. తరతరాలనుండి ప్రపంచం మానవతా పూర్ణ ప్రయత్నంతో రచన జరుపుచున్నది మరి అందు సిద్ధించింది ఇంతే **తలవంపు/అవరోధం.**

10. ఈ దినం మరియు యుగంలో కొంత హద్దులవరకు **ఉద్వేగం/చింత** తప్పని సరిగా మానవుని భాగ్యమై యున్నది.

11. **శారీరక/నీచ** కృత్యముల నుండి దూరంగా తొలగియుండే సామర్థ్యం మనలో గల సామాజిక—ఆర్థికస్థితియొక్క మహత్వపూర్ణ చిహ్నం అయివున్నది.

12. **విరోధం/సంక్రమణ** లేనిదే ఈ జీవనం నీరసం మరియు మాంద్యం అయిపోతుంది

13. **తత్వశాస్త్రం/రాజనీతి** మూర్ఖతాపూర్ణభావగర్భితా వాదులకు ఏమీ రణరంగావకాశం లేదు.

14. స్పష్టరూపంలో మానవుడు సహజ ప్రవృత్తివల్ల **రాజనీతిక/వివేకశీల** ప్రాణికాదు.

15 **పేదరికం/దండన** ఎవ్వరికీ భోగ్యప్రియమైన ఆనందంకాదు, కాని ఇందుమూలకంగా సంభవించే పరికంపం, దయయొక్క ఆనందమును కొందరు అనుభవింతురని తోస్తున్నది.

16. **లావణ్యమంతయు ఖిన్నత/లజ్జవల్ల** కొంచెం రంగువేయబడినట్లు కనిపిస్తున్నది

17. తన సాంప్రదాయకములు, పరలౌకిక జ్ఞానము మరియు **దేవాలయాలు/సహనశీలత** స్థితికి భారతదేశం ప్రసిద్ధయి వున్నది.

18. **శబ్దం/జగత్తు** కేవలం మనస్సుయొక్క బహిర్గత రూపం లేక ఆకారం అయివున్నది.

## No. 55: 18 CLUES

(1) Life holds many doubts but only one certainly, the knowledge of **Death / Truth.**

(2) We have been taught to control, to hide, to sublimate, even to **Deny / Destroy** our emotions.

(3) The well-stored and cultivated mind seldom if ever suffers **Depression / Stagnation.**

(4) Every civilized society must have powers to protect itself from **Destroyers / Dictators.**

(5) The Measure of a life, after all, is not its duration but its **Devotion / Donation.**

(6) Resignation, overconfidence, trying to do too much, lack of **Emotional / Moral** force—all these are familiar blocks to the self-improvement effort.

(7) Each of us has a **Goal / God,** conscious or unconscious.

(8) Inevitably, human ambition is bound up with the desire for personal **Happiness / Success.**

(9) For generations the world has gone on trying to build humanly, and all it has accomplished is **Humiliation / Limitation.**

(10) In this day and age a certain amount of **Hurry / Worry** is the inevitable lot of man.

(11) Ability to keep away from **Manual / Menial** work has been an important distinguishing sign of socio-economic statue among us.

(12) Without **Opposition / Transition,** this life would be dull and drab.

(13) **Philosophy / Politics** is no field for foolish sentimentalism.

(14) Obviously man is not instinctively a **Political / Rational** animal.

(15) No one enjoys **Poverty / Punishment,** but some people seem to enjoy the sympathy and compassion they can excite because of it.

(16) All gracefulness, it seems, is tinged with **Sadness / Shyness.**

(17) India is known for her traditionalism, for her other-worldliness and for her **Temples / Tolerance.**

(18) The **Word / World** is only an external manifestation or projection of the mind.

**గమనిక:** పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లిట్‌క్విజ్ వీక్లీలో ప్రచురించబడును.

## మసగ నవ్వులు...

వినిపిస్తూనేవుంది.' అన్నాడు కిశోర్ ఎంతో ఆశను ప్రకటిస్తూ.

'కిశోర్ నన్ను వంకరించకు; నీ ఆనందాన్ని నువ్వు అనుభవించు' అన్నాడు రమేష్ కొంచెం విసుగ్గా.

'అందాన్ని వర్ణించకుండా వుండటమేమిటి?...అంతకన్న మంచి విషయం ఏం వుంటుంది చెప్పుకొని ఆనందించడానికి? నిజానికి ఆ పడుచుకత్తె పాడుతున్నప్పుడు, మువ్వల మ్రోతలు వినిపిస్తూ చిన్న నవ్వులు కురిపిస్తున్నప్పుడు; ఎంత అందం? ఎంత ఆనందం?'

'కిశోర్! నాకు నిద్రవస్తోంది. తెల్లారి మాట్లాడుదాం.'

'అద్భుతమైన ప్రకృతిని, ఆనంద మయమైన సౌందర్యమూర్తుల్ని చూచినప్పుడు అనిమిషులంగా మారిపోవాలి గాని—నిద్ర అంటావేం?'

'నువ్వు చెప్పేది నేను వినే స్థితిలో లేను. నాది కొద్ది మనస్సు...నన్ను నిద్రపోనీ...నీ గదిలోకి వెళ్లు.'

'నీ మనస్సు సరిగాలేదు రమేష్. ఆ అమ్మాయిని గురించి మరింతగా ఆలోచిస్తున్నావా?'

'కిశోర్! నన్ను ప్రశ్నించకు తెల్లవారిన తర్వాత నీ ప్రశ్నలకు జవాబు చెప్తాను' అంటూ రమేష్ మంచంమీద వ్రాలాడు మెల్లగా.

కిశోర్ గది వదిలి వెళ్ళిపోయాడు. అతడు వెళ్లగానే రమేష్ లేచి కూర్చున్నాడు. పచ్చటి బల్బు కాంతిలో ఆ గది అప్పుడే మొలిచిన కొత్తిమెర పొలంలాగా కనిపిస్తోంది. కిటికీలోనుంచి చూస్తే సరస్సులో తిరిగే నౌకల దీపాలు చీకటి బ్రతుకులో ఆధ్యాత్మికపుటంచులు కనుగొనడానికి మహాయోగులు తెరిచిన జ్ఞాననేత్రాలవలె కనిపించాయి. అనంత ప్రకృతిలో అణువణువునా ఆయన చిద్విలాసమే గోచరిస్తోంది' అనుకొన్నాడతడు.

ఇంతలో టెలిఫోను మ్రోగింది. చివాలున లేచివెళ్లి రిసీవర్ అందుకొన్నాడు. కిశోర్ పిలుస్తున్నాడనిపించి కొంచెం విసుగ్గా 'హలో' అన్నాడు. కాని వీణ తీగమీద చిన్నచిన్న చిటికెలువేసి వదిలినట్లు...తీయటి తుంపులు గల స్వరం వినిపిం

'అవును. అవగాహన అనురాగానికి ఆలంబన విశ్వాసం శాశ్వత సుఖానికి ఆనవాలు. త్యాగం భోగానికి పసిడిసోపానం. తాత్కాలికోద్వేగాలు సద్యఃఫలితాన్వేషణోద్వేగాలు...పవిత్ర ప్రణయానికి విరుపులు. మీకు నేనిక చెప్పలేను... దయచెయ్యండి.'

'వెళ్ళమన్నారా! మీ రింకా ఇక్కడ వుంటారా కొన్నాళ్ళు?'

'రే పొక్కరోజు మాత్రం'

'ఒక్కరే వచ్చారా!'

'లేదు... ఒక మిత్రుడున్నాడు ప్రక్క ఎనిమిదో నెంబరు గదిలో'

'మీ విజిటింగ్ కార్డు ఇస్తారా కొంచెం'

'నా విజిటింగ్ కార్డా! వద్దులెండి... నా కన్న మహనీయులు చాలామంది వున్నారు దేశంలో.'

'మీరు చెప్పిందంతా నిజంకావచ్చు... ఈ చివరిమాట మాత్రం అబద్ధం... వెళ్ళివస్తాను'—అని ఆమె వెనక్కి తిరిగి చూస్తూ వెళ్ళిపోయింది.

తుషార్ సరాసరి ఎనిమిదో నెంబరు గది దగ్గరకు వెళ్ళి బెల్ నొక్కింది. కిశోర్ తలుపు తెరిచాడు. అష్టమి చంద్రుడి లాగావున్న అతనిముఖం ఒక్కసారిగా పూర్ణ బింబమైంది.

'మీరు తుషార్‌ను కలుసుకొంటున్నారు' అన్నదామె చలిగాలికి బెదిరిన లేడి తల కొంచెం వాల్చినట్లు మెడ ప్రక్కకువంచి.

'కిశోర్ మీకు స్వాగత మిస్తున్నాడు' అన్నాడతడు కరచాలనానికి ఆయత్తపడుతూ. కలసిన చేతుల్ని కొంచెంసేపు అలావుంచి ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూస్తూ తలలు ముందుకు వంచారు.

మరునాడు ఉదయం మిత్రులిద్దరూ కలుసుకొన్నారు. తుషార్ ప్రసక్తి ఎవరూ తేలేదు. తిరిగి ప్రకృతి సౌందర్యాన్ని తిలకించడంకోసం బయలుదేరారు. అప్పుడు కిశోర్ అన్నాడు 'రమేష్! ఈ రమణీయ ప్రకృతిని ఎంత తిలకించినా తనివితీరడం లేదు—ఇంకొక్క రెండురోజులు వుందామా' అని.

'మన హృదయాలు ఇప్పటికే నిండిపోయినాయి. ఇక చోటులేదు. రేపు వెళ్ళిపోదాం. అనుభూతికి అంచులు దిద్దుకోవడం గొప్ప శిల్పం కిశోర్' అన్నాడు రమేష్. కిశోర్ మిత్రునిమాటకు ఎదు చెప్పలేక పోయాడు.

ఆ సాయంత్రం నీలగగన్‌కు తిరిగివచ్చి వసారాలో పచార్లు చేస్తున్నాడు రమేష్. చాలా జరఫ్‌గా నడిచి వస్తున్న తుషార్ రమేష్‌నుచూచి జోరు తగ్గించి చేరువక్కు వచ్చినతర్వాత 'నమస్తే' అంది. అతడు తలవూపాడు.

మరునాడు చలికొండలపై తొలిరేఖలు

వికసించేవేళ మిత్రులు ప్రయాణ సన్నద్ధు లయ్యారు. రమేష్ కిటికీ తలుపులు తెరి చాడు. అక్కడొక కవరు పడివుంది. ఆశ్చ ర్యంతో చదవడం ప్రారంభించాడు.

రమేష్‌గారికి, నమస్కారాలు.

'మొన్నరాత్రి మీ దర్శనమైంది. మీ ప్రవచనాలు నన్నెంతో అలరించాయి. నా హృదయాంతరాళంలో పూడుకొని పోయిన జీవిత సత్యాలను వెలికితీసి నాకు మహోపా కారం చేశారు. ప్రేమ మహత్తరమైన ఆరాధనాశక్తి అనీ, ప్రేమహృదయాలలో ఆద్యంతాలు ముడివేసుకొని ముచ్చటలు పడాలనీ నా అభిలాష.

'కాని—రమేష్‌జీ—నా బ్రతుకు వేరు త్రోవ పట్టింది. నాగరికతా విలసనం రంగుల విసనకర్రలాగా విప్పుకొని జీవి తంలో మలయమారుతం ప్రసరింప చేస్తుం దనే శుష్కవ్యామోహంలో చిక్కుకొంది మనస్సు, లేతవయసులోనే మాయపూలను పూసుకొంది వయస్సు.

'అప్పటినుంచి నైతికవిలువలు లెక్క చెయ్యకుండా హృదయాన్ని గాలిపటంచేసి ఎగరవేస్తూ ఆశలుకాని ఆశలకు అర్రులు జాస్తూ దొరికిన పురుషుని ఆ పూటకు మురిపిస్తూ జీవిస్తున్నాను: మీతో మాట్లాడినప్పటినుంచీ గుండెలు కొండలు మోస్తున్నాయి. కాని మనస్సు మారడం లేదు. చిలిపివాంఛలకు లోనైన జీవితం

## మసగ నవ్వులు...

చితిని చేరేవరకూ, ఆ విషవలయాలలో నుంచి బయటపడలేదు.

మసకనవ్వులతో మాయనటన సాగి స్తున్న నాకు మీబోధన మనస్సులో మంచు పువ్వులు పూయించింది. మీ రందించిన ఆశయం—మహాసదికి ఆవల పద్మ దీపా లయంగా గోచరిస్తూంది. జీవితప్రవృత్తిని మార్చుకోక పోయినా, మీరు అందించిన సందేశాన్ని విస్మరించలేను.

ఈ కవరులో అయిదు వందల రూపాయ లుంచుతున్నాను ఇది గురు కట్నంగా భావించండిగాని బహుమతి అని మాత్రం అనుకోకండి. మీకు బహూకరించే సంపద నాదగ్గరలేదు మీకీసొమ్ము అక్కర లేదని తెలుసు. కాని మీరు దీన్ని వుపయో గించవచ్చు — ఏ పతితోద్ధరణతో, సాం స్కృతిక విస్తరణకో!

మీ ఎడ్రసు కిశోర్‌గారివద్ద తీసు కొన్నాను. మీకు ప్రతినెలా ఇంత మొత్తం పంపుతాను ఎప్పుడు పంపకపోతే అప్పుడు తుషార్ ఈ లోకంనుంచి నిష్క్రమించిం దని భావించండి.

గుండెల్లో చంద్రనిప్పులు దాచుకొని జీవిస్తున్న—తుషార్.

రమేష్ ఉత్తరం చదివి ఉద్విగ్ను డయ్యాడు.

'తుషార ఆ వుత్తరంద్వారా తన హృదయపు లోతుల్ని త్రవ్విపోసుకుంది. వెలుగు చూడలేని విచిత్ర నేత్రమొకటి అవతరించిందామె ముదుట. అపశృతికి అంకితమైపోయిన అమరవీణ' అనుకొన్నా డతను.

ఇంతలో కిశోర్ వచ్చాడు. రమేష్‌వంక చూచి 'ఏం! ప్రయాణం ఆపేశావా?' అన్నాడెంతో సంతోషంతో.

'లేదు...ప్రయాణానికి సిద్ధంగా వున్నాను. కానీ ఈ ఉత్తరం చూడు.' అని అతనికి అందించాడు. కిశోర్ ఉత్తరం చదివి ఊపిరిసలపని వ్యక్తిగా మారిపోయాడు. కొంచెంసేపైన తర్వాత 'విన్న కలుసు కొందా?' అన్నాడు.

'అవును, ఉత్తరం చదివావుగా?'

కొంచెంసేపైన తర్వాత ఇద్దరూ బయలుదేరారు. పలుచగా మంచుపేరిన రోడ్డువెంట కారు పోతుంటే, మంచు పింజలు పింజలై కొంచెం ఎత్తువరకూ ఎగురుతోంది. రమేష్‌కు జ్ఞాపకం వచ్చింది.

'మీరు నా మనసులో మంచుపువ్వులు పూయించారు' అన్న తుషార్ మాట.

రమేష్‌కి శోరోతో అన్నాడు 'చదివావుగా! కవరులో అయిదువందలు పెట్టానని తుషార్ వ్రాసింది. అవి పతితోద్ధరణకుట. ఏం చేద్దాం?' అన్నాడు రమేష్.

'నీకు ఇవ్వడంతోనే పతితజనోద్ధరణ ప్రారంభమైంది. ఆమె నాదగ్గర బదులు అడిగి అయిదువందలు తీసుకొంది. ఇవ్వాళ ఉదయం అడిగితే హోటల్ ఖాళీచేసి వెళ్ళి పోయిందని చెప్పారు' అన్నాడు కిశోర్.

'అయిదువందలు చదివిచ్చావా' అని రమేష్ ఆశ్చర్యంగా అడిగాడు.

'వందలేమిటి! బ్రతుకులో కొంతభాగం కూడా—' అన్నాడు కిశోర్ తలవంచుకొని.

కారు కొండమలుపు తిరిగి ఒక చిన్న లోయలోకి సన్నగా జారుకొంది. రోడ్డు ప్రక్కవున్న ఒక పొదలో కొమ్ములు చిక్కు కొన్న లేడి వాటిని బయటికి తీసుకోలేక ఎంతో పెనుగులాడుతోంది.

రమేష్ దానివంక చూశాడు. 'వ్యామో హాలలో చిక్కుకొన్న కానపులి లేడిలాటివాళ్లే కిశోర్' అన్నాడు. కిశోర్ తల ప్రక్కకు తిప్పుకొన్నాడు.

కారు చుట్టూ మంచురేకులింకా ఎగురు తు వే వున్నాయి. ●



శ్రీ. గజేంద్రరావు (పక్షికానగర్)

నీలాపనిందలు పోవాలంటే (లూనార్ మాడ్యూల్) 'ఈగిల్' కథ చెప్పాలా?

చెప్పాలి; తప్పదు. 'అపోలో 11' వృత్తాంతం చెప్పాలి. అదే విషయం పాపం చంద్రుడుకూడా చెప్పుకునే రోజు వచ్చింది! ఇది మీకు తెలుసా?

డా. మస్తాన్‌రావు (అమలేరియా)

'అపోలో 11' తర్వాత తార ఏమనుకుంటుంది?




సెకెండు మేరేజికి ట్రైచేసుకోవాలనుకుంటుంది పాపం.

తే. లక్ష్మావధానులు (కప్పెపేళ్ళపురం)

మీ 'అంతరాత్మ' ఎంత పెద్దది?

అవును మొన్నకూడా ఒకాయన అన్నాడు చాలా పెద్దదని. మీరు కూడా అదేమాట అంటున్నారు. అంతా రాష్ట్రపతి భవనంమాయ..

కో. తిరుమలరావు (నిపేధపురం)

చంద్రుడిలోని మచ్చనుగూర్చి వివరించగలరా?

మానవుని బుర్రలో మట్టిలాగే చంద్రునికి కూడా కొంచెం ఎక్కువ ఐరన్ కేజి మట్టి వుండి వుంటుంది; అందులో మనవాళ్లు కొంచెం పట్టుకొచ్చారు. మొత్తం మట్టి తీసుకొచ్చేవరకు ఆ మచ్చ పోదు.




తే. డిస్టిసుభట్లు (ఊహానగర్)

మీ పాపాయికి చంద్రుణ్ని చూపించే ఉద్దేశ్యంలేదా?

మొన్నటివరకు మా బాబుకి 'చందమామ రావే' అని చెప్పి చూపించాం. ప్రస్తుతం నీవు రాలేవు నేనే వస్తాను అని చెప్తున్నాం. అతను రాలేడని యిన్నాళ్లకు తెలిసింది.

పా. ముకుందరావు (పుట్టపర్రు)

చంద్రలోకం భూలోకంలో ఒక ప్రాంతమయితే అక్కడేం స్థాపిస్తారు?

స్వార్థం అనుకోకండి — వీపుగా గవర్నమెంటు సైటుయిస్తే ఒక పెద్ద స్టుడియో కట్టాలని వుంది: (ప్రాంతీయ సంఘం తర్వాత).




మె. కమలాకరం (జలభక్షపువాడ)

దేశంలో వినాయకుల సంఖ్య అధికమవుతూవుంది. అసలు వినాయకుడు ఏం పేరు పెట్టుకుంటే బాగుంటుంది?

పేరు మారుస్తే ఏం లాభం లేదు; అసలు వినాయకుణ్నే మార్చేయాలి— పాపం వినాయకుడిది కుడుంపట్టు. మన వినాయకులది ఉడుంపట్టు.

వు. లిస్టెట్ — ప్రకాశం (ఖగపురి)

భూలోకంనుండి చంద్రలోకానికి వెళ్ళడానికి టిక్కెట్టు ఎంత పెడితే బాగుంటుంది?



స్టూడియో చాల పెద్దదో నండోయ్!!

ఈమధ్య చాలామంది టిక్కెట్లు లేకుండా వెళ్లిపోతున్నారు కాబట్టి వెళ్లేముందు టిక్కెట్లు ఖరీదు నిర్ణయించేకంటె వెళ్లి చేరిన తరువాత ఖరీదు నిర్ణయిద్దాం. ఈ విషయం ఎవరికీ చెప్పకండీ!

ఏ. ను. గురునాథం (అడవిపాలెం).

మీరు చంద్రలోకం వెళ్ళి చంద్రుణ్ని చూడగలిగితే ఆయనకు ఏం ప్రెజెంట్ యిస్తారు?

ఇంకేముంది; చెడు అలవాట్లను కలుగచేస్తాం; 'ఫ్లాప్' అయిన పిక్చరు ఒకటి వేసి చూపిస్తాం.

పో. తుహినకరరావు (వాములవాడ)

చంద్రలోకంలో స్టుడియో ఎప్పుడు కడతారు? కడితే మీరు వెడతారా?

ఇక్కడిరాళ్లు అక్కడికి వెళ్లినపుడు తప్పక కడదాం. కాని దాని ఓపెనింగుకు మాత్రం మనిద్దరం వుండంకదూ. ●

# మీ పాపని జలుబుతో బాధపడనిస్తారా?

అక్కర లేదు..!

**విక్స్ వేపోరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది. ముక్కు దిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాప హాయిగా, చక్కగా నిద్రపోతుంది.**

విక్స్ వేపోరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయుమ్పు. ముక్కు దిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపోరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:


బయట-చర్మం మీద


లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపోరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది. హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపోరబ్ మందు ఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందు ఆవిరి వంట్లో ప్రవేశించి, ముక్కు దిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

### ప్రత్యేక గమనిక



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపోరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపోరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపోరబ్ వాడండి.




## విక్స్ వేపోరబ్ - జలుబుబాధలకి ఆధునిక ఔషధం

# మన హాస్య నటీనటులు

## రేలంగి

వీరు నటించిన మొదటి చిత్రం శ్రీ కృష్ణతులాభారం అప్పటినుండి యిప్పటివరకు సాటిలేని మేటి హాస్యనటుడుగా కొనియాడబడడానికి కారణం వారి నటనలోని మెలిమితనమే, వీరి హాస్యం ప్రత్యేక పద్ధతిలో వుంటూ, యెప్పటికప్పుడు కొత్తదనాన్ని చూపిస్తుంటుంది. ఇప్పటికి 250 చిత్రాలలో నటించినా, యింకా నేర్చుకోవాల్సింది చాలా మిగులు వుంది అని తలపోస్తూ, నిరంతర కృషి చెయ్యడంవల్లనే యెప్పటికీ శ్రీ రేలంగి హాస్యానికి



రమణారెడ్డి

విలువ వుంది. హాస్యనట చక్రవర్తి శ్రీ రేలంగి ప్రస్తుతం పది చిత్రాలలో నటిస్తున్నారు.

## రమణారెడ్డి

మీరు నటించిన తొలిచిత్రం మానవతి, ఇంతవరకు నటించిన ప్రతిపాత్రను తన నటనా వైదుష్యంతో మెప్పించి, తన మండలానికి (నెల్లూరు) చెందిన బాషతో హాస్యరస పోషణలో నూతనత్వాన్ని యేర్పరచారు. శ్రీ రమణారెడ్డి మాత్రమే చెయ్యగల పాత్రలు కొన్ని వున్నాయి, అలాంటి భూమికలను నిర్వహించడంలో ఆయనకు ఆయనేసాటి అని అనిపించుకున్న వీరు దాదాపు 170 చిత్రాలలో నటించారు.

## పద్మనాభం

'పాతాళభైరవి'తో గుర్తింపు వచ్చింది, రాగుడుమూతలుతో రాణింపు వచ్చింది. పాట్లి



రేలంగి

ప్లీడరులో పరిపక్వత నందుకుంది, అదృష్టవంతులులో కలిసివచ్చి మూగనోముతో పరిపూర్ణతనందుకుంది. పాత్రకు తగినట్లు గొంతుకను మార్చి, హాస్యంలో కొత్త అధ్యాయాన్ని సృష్టించిన పేరు వీరినే చేరుతుంది. శ్రీ పద్మనాభం యిప్పుడు హాస్యనటుడు మాత్రమే కాదు, దర్శకుడు కూడా. రేఖా అండ్ మురళీ ఆర్ట్సువారి కుమ్మరిమొల్లకు దర్శకత్వపు బాధ్యతను నిర్వహించడమేగాక, ఆ చిత్రంలో తెనాలిరాముడి పాత్రను పోషిస్తున్నారు. వీరు నటించిన చిత్రాలు నూటఅరవై వుంటాయి, ప్రస్తుతం ఆరు చిత్రాలలో ముఖ్య హాస్యనటుడిగా నటిస్తున్నారు.



పద్మనాభం

## నాగభూషణం

సీరియస్ పాత్రల్లో హాస్యరసాన్ని చిందించగల నేర్పు, కామెడీ చేస్తూనే సీరియస్‌గా వుండగల ప్రజ్ఞ వీరి నటనలోని ప్రత్యేకత, సంభాషణోచ్చారణలోనే నవ్వించగల శక్తిని బడసిన శ్రీ నాగభూషణం లేని చిత్రమంటూ ప్రస్తుతం లేదంటే మీరు నమ్మరుగా, ఇటీవలే వీరు ముఖ్యనటుడిగా సంపూర్ణ హాస్యపాత్రను ధరించిన నాటకాలరాయుడు విడుదలయింది.



రాజ్‌బాబు

## రాజ్‌బాబు

వీరు కనిపించిన మొదటిచిత్రం సమాజం, వీరు ప్రస్తుతం నటిస్తున్న చిత్రాలు మూడు పదులు. ఇంత అభివృద్ధిలోకి యెలా వచ్చారు? కృషి, సాధన, దీక్ష— మూడూ పనిచెయ్యసాగాయి. చిత్ర చిత్రానికి కొంతయినా ప్రత్యేకతను కనబరుస్తూ, ప్రేక్షకుల్ని ఆకట్టుకోగల్గుతున్నారు. మనకున్న ఉత్తమ హాస్యనటుల్లో శ్రీ రాజబాబు ఒకరు.

## చలం

దాసి చిత్రం ద్వారా వెండితెరకు పరిచయమయిన శ్రీ చలం కథానాయకుడిగా వేషాలు ధరించి ఆపైన హాస్యనటుడిగా ప్రేక్షకుల అభిమానాన్ని సంపాదించి చిత్రరంగంలో స్థిరత్వం యేర్పరచుకున్నారు. తమిళంలో శ్రీ నాగేష్ ధరించిన క్లిష్టమయిన పాత్రలలో ముస్లాతిక వంతు తెలుగులో



అల్లు రామలింగయ్య

శ్రీ చలం ధరించి, తన ప్రత్యేక ప్రతిభను కనబరుస్తున్నారు. తను ధరించే పాత్రలో లీనమై నటించి, ప్రేక్షకులను మెప్పించగల ప్రజ్ఞగల శ్రీ చలం సత్తెకాలపు సత్తెయ్య చిత్రంలో అపూర్వంగా నటించారు.

## అల్లు రామలింగయ్య

డైలాగులను చెప్పడంలోనే హాస్యరసాన్ని అందించగల దిట్ట, వీరు మాట్లాడుతున్నప్పుడు, ఆ మాటలకు, తగ్గట్టు నటించుటకు నవ్వని ప్రేక్షకుడుండడు. వీరిని వెండితెరకు కీ. శే. డా. రాజారావు పుట్టిల్లు చిత్రం ద్వారా పరిచయం చేశారు. ఇప్పటికి షుమారు 140 చిత్రాలలో నటించారు.



కె. వి. చలం

## బాలకృష్ణ

ఇతడి ఆకారం తెరపై కనిపిస్తేనే జనం నవ్వ గలరు. డైలాగులు లేకున్నా చేష్టలతో నవ్వించగల సామర్థ్యం వుంది. చార్లీచాప్లిన్ అంటటి వాడ్ని కావాలను కుంటా డు, కీచకవధ మొదటి చిత్రం, ప్రస్తుతం నటిస్తున్నవి పది చిత్రాలు.

## రావికొండలరావు

వీరు నటించిన తొలిచిత్రమయిన దాగుడు మూతలు లోనే మనకు మరొక హాస్యనటుడు చిక్కాడురా అనిపించుకోగలిగారు. ఇచ్చిన పాత్రను బాగా అర్థంచేసుకుని, ఆ పాత్ర స్వభావాన్ని బట్టి సంభాషణలను చెప్పి, సన్నివేశానుగుణ్యమయిన భావ ప్రకటన ద్వారా ప్రేక్షకులను గిలిగింతలు పెట్ట గలరు. వీరు ప్రస్తుతం డజను చిత్రాలలో నటి స్తున్నారు.



గీతాంజలి

## కె. వి. చలం

బందిపోటు దొంగలు చిత్రంలో ఒక వినూత్న మయిన పాత్రద్వారా వింతయిన నటనను కనబరచి, హాస్యనటులలో తనకొక ప్రత్యేక గుర్తింపును సంపా దించగలిగారు. డైలాగులో వెరైటీ యే వీరి నటన లోని ప్రత్యేకత. శ్రీ కె. వి. చలం ప్రస్తుతం పది చిత్రాలలో నటిస్తున్నారు.

## సూర్యకాంతం

కొన్ని చిత్రాల విజయాలు యీమె నటనవల్లే నేమోననిపిస్తుంది. ఈమె దురుసుగా చెప్పే మాటల్లో గంపెడంత హాస్యం పుట్టి పడుతుంది. ఈమె ఎడమచేతి వాటంతో మన యెదల్లో హాస్యాన్ని నింపేస్తుంది. ఈమె హాస్యంలో జీవకళ, యీమె సంభాషణోచ్చారణలో భావకళ, వుండడంచేత యీమె నటనలో సహజత్వం వుంది అనిపిస్తుంది. ఈమె ప్రస్తుతం నిర్మించబడుతున్న చిత్రాలలో యాభై శాతం చిత్రాల్లో నటిస్తూంది.



సూర్యకాంతం

# మన హాస్య నటీనటులు

## రమాప్రభ

శ్రీ ప్రత్యగాత్మ డిస్కవరీ యీమెకి అందుకే చకచక పైకి వచ్చేసింది. హుషారుగా నటిస్తుంది. ఓవర్‌గా నటించదు. భావప్రకటనలో బ్యాలెన్స్ కనబడుతుంది. ఈమె నేటి బిజీ హాస్యనటి అనడం వుచితం.

## ఛాయాదేవి

ఈమె సంభాషణలను స్పష్టంగా విప్పిచెప్పి, వింతధోరణిలో హాస్యాన్ని తను ధరించే పాత్రలో గుప్పించగల సామర్థ్యాన్ని బడసింది. గయ్యాళిపాత్ర



రమాప్రభ

లను ధరించినా, ప్రేక్షకులు నవ్వాలి అని యీమె నటన నిరూపిస్తుంది. ఈమె యిప్పుడు పది చిత్రాలలో నటిస్తున్నది.

## గీతాంజలి

శ్రీ పద్మనాభంకు జంటగా అనేక చిత్రాలలో నటించి, వారికి యీడయిన నటనను ప్రదర్శించి, ప్రేక్షకుల అభిమానధనాన్ని సంపాదించగలిగింది, పాత్ర స్వాభావాన్ని అనుసరించి ఆ పాత్రకు తగ్గట్టు భావప్రకటన చేస్తూ ప్రేక్షకులను గిలిగింతలు పెట్టగల కుమారి గీతాంజలి ప్రస్తుతం హాస్య పాత్రలకన్నా వుపనాయిక పాత్రలనే అధికంగా ధరిస్తూ వుంది.

## మీనాకుమారి

ఎప్పటికప్పుడు యేదయినా కొత్తదనాన్ని



మీనాకుమారి

చూపెట్టి ప్రేక్షకులను ఆకట్టుకోవాలనే ఆసక్తి కనిపిస్తూంది. ఈమె తనకిచ్చిన పాత్రలో లీనమై నటించడం వల్లనే, యీమెకూడా హాస్యనటిగా ప్రేక్షకుల్లో సముచిత స్థానాన్ని యేర్పరచుకో గలి గింది. ఈమె నటించిన మొదటి చిత్రం సతి సుకన్య, ప్రస్తుతం ఆరడజను చిత్రాలలో ముఖ్య హాస్యనటిగా నటిస్తూంది.

* * *

పైన పేర్కొన్నవారుగాక, హాస్యరసాన్ని పోషించ డంలో ప్రత్యేకతను ప్రదర్శించే వాళ్లలో శ్రీయు తులు నల్లరామమూర్తి, సీతారాం, గుంటూరు వెంక టేష్, సాక్షిరంగారావు, మోదుకూరి సత్యం, కోళ్ల సత్యం, సారథి, పొట్టిలక్ష్మి మొదలగువారిని పేర్కొ నడం వుచితం.

—శ్రీనివాస్

# రాజసింహ

కాశీ మజిలీ కథలు చదువుకోడానికి ఎంతో వసందుగా వుంటాయి. అలానే కథలో కథ జొప్పిస్తూ చూడముచ్చటగా నిర్మించారు రాజాపిక్చర్స్‌వారి రాజసింహ.

హీరోమీద ఎక్కువ కథ నడిస్తే చిత్రానికి ఎంతబలం చేకూరుతుందో అనుభవపూర్వకంగా తెలుసుకున్న యువదర్శకుల్లో సుబ్బరామదాసు ఒకరు. ఈ చిత్రంతో సుబ్బరామదాసు జానపద చిత్రదర్శకుడుగా ముద్రవేసుకొనే ప్రమాదం ఏర్పడుతోంది!

ప్రాణగండంతో పుడతాడు రాజసింహుడు. మహారాజు మృత్యుంజయ హోమంచేసి రక్షాబంధాన్ని సంపాయించగల్గుతాడు. తల్లి తన ప్రాణాన్ని లెక్కచెయ్యక కుమారుని ఆయురారోగ్యాలకోసం ఆ రక్షాబంధాన్ని కడుతుంది. ఫలితంగా ఆమె మాంత్రికుని శాపానికి బలియై శిలగా మారిపోతుంది. రాజసింహుడు రాజగురువువద్ద పెరిగి పెద్దవాడవుతాడు. తల్లి రహస్యాన్ని తెలుసుకుని మాంత్రికుణ్ని వధించి తల్లిని దక్కించుకుంటాడు.

చక్కని సెంటిమెంటుగల ఈ చిత్రం ఆదినుంచి చివరివరకూ ఉత్సాహంగా సాగిపోతుంది. దర్శకుని ప్రతిభ ప్రతి సన్నివేశంలోనూ వ్యక్తమవుతుంది.

కాంతారావు నటనకు తగిన పాత్ర, పాత్రకు తగిన నటన ఈ చిత్రంలో స్పష్టంగా కనిపిస్తుంది. 'జానపద కథానాయకుడు' అన్న తన పేరును మరోసారి ఈచిత్రంలో రుజువు చేసుకున్నారాయన. కథానాయకిగా వాణిశ్రీ కొత్త సొంపులు ఇందులో చూడగల్గుతాం. అందరూ గ్రహించేవిధంగా కాక, రాజనాల ప్రత్యేక తరహా పాత్రలో కనిపిస్తారు. శ్రీరంజని నటన చిత్రానికి బలం కూర్చిందనే చెప్పాలి. ఆమె తక్కువ అవకాశంలో ఎక్కువ చాతుర్యం కనబరిచారు. బాలకృష్ణ హాస్యం బాగుంది. జగ్గారావు, కోళ్ల సత్యం, సత్యనారాయణ, గీతాంజలి, మీనాకుమారి, జ్యోతిలక్ష్మి, లక్ష్మి తదితర ముఖ్యపాత్రలను పోషించారు.

వీటూరి కథ, మాటలు, పాటలు చిత్రాన్ని సర్వాంగసుందరం చేశాయి. సత్యం సంగీతం వాటిని రసభరితం చేసింది. కెమెరా కన్నప్ప. స్క్రీన్‌ప్లే, ఎడిటింగ్, దర్శకత్వం కె. సుబ్బరామదాసు. దోనేపూడి కృష్ణమూర్తి నిర్వహించిన రాజసింహ చిత్రానికి నిర్మాత బి. వీరాజా.

—నికరాజు



'రాజసింహ'లో వాణిశ్రీ, కాంతారావు

# సినిమా

## తెలుగు తెరకు మరో కొత్త దర్శకుడు...

శ్రీ బ్రహ్మం మంచి నటుడే కాదు— చక్కటి కథకుడు అని విద్యోదయవారి సాంఘికచిత్రం నిరూపిస్తుంది; ఈ చిత్రం ద్వారా కొత్త దర్శకుణ్ని పరిచయం చేస్తున్నది; ఆయనపేరు శ్రీ జి. వి. ప్రభాకరరావు. ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను శ్రీయుతులు హరనాథ్, గుమ్మడి, రేలంగి, రాజబాబు, సారథి, పి. వెంకటేశ్వరరావు, రాజశ్రీ, రమాప్రభ, వరలక్ష్మి, ఉదయశ్రీ పోషిస్తున్నారు.

శ్రీయుతులు సుంకర పోతరాజు, జయమంగళ కృష్ణమూర్తి నిర్మిస్తున్న ఈ చిత్రానికి సంగీతాన్ని శ్రీ సత్యం, మాటలను ఎస్. వి. రామారావు, పాటలను దాశరథి, కెమెరాను జానకిరామ్, కళను సూరన్న, కూర్పును వెంకటేశ్వరరావు, మేకప్‌ను మాధవరావు, రమేష్, సహకార, సహాయ దర్శకత్వాన్ని వరుసగా వెంకటేశ్వరరావు, భాస్కరరావు, నిర్మాణ నిర్వహణను జి. మాణిక్యాలు నిర్వహిస్తున్న ఈ చిత్రం యొక్క మొదటి షెడ్యూలు పూర్తయింది.

## అన్నదమ్ముల మధ్య భావ సంఘర్షణ

నిరంతర హరినామ స్మరుడయిన అన్నయ్యా, లౌకిక పద్ధతుల నలవరచుకున్న తమ్ముయ్యలమధ్య జరిగే భావ సంఘర్షణం ప్రతిఫలమే చిత్రకల్పనవారి 'బుద్ధిమంతుడు' చిత్రం. అన్నపేరు మాధవయ్య; తమ్ముడి పేరు గోపి. ఈ రెండు పాత్రలను శ్రీ నాగేశ్వరరావు అద్భుతంగా పోషించారట. శ్రీ అక్కినేని తల్లిగా శ్రీమతి శాంతకుమారి, చిరస్మరణీయమయిన నటనను ప్రదర్శించారట. శ్రీ ముళ్లపూడి రచన, వచనాలు ప్రేక్షకుల్ని ఒక ప్రక్క ఆకట్టుకుంటే, శ్రీ మహదేవన్ సంగీతం మన మనస్సులో తియ్యటి అనుభూతుల్ని యేర్పరచి తీరుతుంది. శ్రీ నాగభూషణం, శ్రీమతి సూర్యకాంతంల ద్వారా సరికొత్త పంథాలో ఉన్న పాత్రలని పోషించారు. అతిథి



'అగ్గివీరుడు'లో విజయలలిత

పాత్రల్లో శ్రీయుతులు గుమ్మడి, శోభన్‌బాబు ఉన్నారు. చిత్రం ప్రారంభంనుండి సుఖాంతం వరకు శ్రీ బాపు దర్శకత్వపు విలువలు అడుగడుగునా కనిపిస్తాయి. శ్రీ నాగేశ్వరరావు 46 వ జన్మదిన సందర్భంగా సెప్టెంబరు 20 న విడుదలకానున్న 'బుద్ధిమంతుడు' చిత్రానికి శ్రీ ఎస్. ఎస్. మూర్తి నిర్మాత. లక్ష్మీ పంపిణీ సంస్థ ఈ చిత్రాన్ని విడుదలచేస్తారు. ప్రెస్ రిలేషన్సును కల్పనా సెంటర్ ప్రయిపస్ నిర్వహిస్తున్నారు; ఈ చిత్రంలోని మరో విశేషం శ్రీయుతులు నాగేశ్వరరావు, విజయనిర్మలల కాంబినేషన్ ఇతర ముఖ్యపాత్రలని కృష్ణంరాజు, సంధ్యారాణి, మీనాకుమారి పోషించారు

మహాకవి చిత్రాల్లో ద్విపాత్రాభినయం

1969 లో శ్రీ నాగేశ్వరరావు-మూడు చిత్రాల్లో ద్విపాత్రాభినయం చేస్తున్నారు; మూడింటిలో ధరిస్తున్న పాత్రలు విభిన్నమైనవి, క్లిష్టమయినవి; ఒక పాత్ర స్వభావం మరొకదానిపై పడకుండా; ఆయా పాత్రల్లో ప్రత్యేక ప్రతిభను ప్రదర్శించి అసమాన నటనాధురీణుడు అనిపించే అనిపించుకునేలా నటిస్తున్నారు,

సురేష్ మూవీస్‌వారి 'సిపాయి చిన్నయ్య'లో త్యాగయ్యగాను, కెప్టెన్‌గాను అసాధారణ ప్రజ్ఞాపాటవాన్ని చూపెట్టారు; ఈ చిత్రంలో కె. ఆర్. విజయ, భారతి నాయికలుగా నటించారు; ఈ చిత్రానికి శ్రీ తురయూర్‌మూర్తి కథను శ్రీ భమిడిపాటి. మాటలను, శ్రీ విశ్వనాథం సంగీతాన్ని, శ్రీ బాస్కర్ కెమెరాను, శ్రీ కుమార్ ఆర్టును, శ్రీ మార్తాండ్ ఎడిటింగును శ్రీ జైహింద్ సత్యంస్టైల్సు శాఖలను నిర్వహించారు. చిత్రంలో కనిపించే ప్రధాన పాత్రలను శ్రీయుతులు జగ్గయ్య, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, రాజబాబు, పండరీబాయి, రావికొండలరావు, మిక్కిలినేని, అల్లు రామలింగయ్యలు పోషించారు; ఈ చిత్రానికి శ్రీ జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకుడు; శ్రీ డి. రామానాయుడు నిర్మించిన యీ చిత్రాన్ని విజయసురేష్‌వారు విడుదలచేస్తారు.

* * *

రవీంద్రా ఆర్టుపిక్చర్సు వారి 'ధర్మదాత'లో తండ్రిగా, కుమారుడిగా శ్రీ నాగేశ్వరరావు నటించడానికి అంగీకరించారు; ఇంతవరకు శ్రీ అక్కినేని నటజీవితంలో మరపురాని పాత్రలనెన్నో ధరించారు. 'ధర్మదాత'లోని వీరి నటనావైదుష్యం ఆయన నటనపై ప్రేక్షకులకున్న గౌరవాన్ని మరింత యినుమడింపచేస్తుంది. ఈ చిత్రానికి శ్రీ పినిశెట్టి మాటలను; శ్రీ చలపతిరావు సంగీతాన్ని, శ్రీ వి. వి.

# ధ్రువతార రాలిపోయింది

మద్రాసులోవున్న పెద్ద స్టుడియోలలో జెమినీ ఒకటి; ఈ స్టుడియోకు శ్రీ ఎస్. ఎస్. వాసన్ అధినేత. శ్రీ వాసన్ ఆగస్టు 26 వ ఉదయం తొమ్మిదిగంటలా ఇరవై అయిదు నిమిషాలకు ఎడ్వర్డ్ ఎలియట్స్ రోడ్డులోని వారి స్వగృహంలో స్వర్గస్థులయ్యారు.

గత రెండు మాసాలుగా శ్రీ వాసన్ ఆరోగ్యం సంతృప్తికరంగ లేదట; మందులు వాడుతూనే వున్నారట; వీరికి ప్రశాంతమయిన మరణం సంప్రాప్తించింది. వీరి వయస్సు 66 సంవత్సరాలు.

శ్రీ వాసన్ 1903 లో జన్మించారు.



చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకున్నారు; వీరితల్లి, మేనమామ కష్టపడి చదివించారు. ఆపైన స్వయంకృషితో 'ఆనందవికటన్'కు సంపాదకులయ్యారు. జెమినీ స్టూడియోను నిర్మించారు. ఆ వేళా వేళ లాక్షాఫీస్ చిత్రాలను తయారుచేశారు. ఆ కాలంలోనే ముప్పైలక్షల రూపాయలను ఖర్చుపెట్టి 'చంద్రలేఖ' చిత్రాన్ని భారీఎత్తున నిర్మించారు. ఆచిత్రం కనకవర్షం కురిపించింది. అదే చిత్రాన్ని హిందీలోకూడా నిర్మించి విజయఢంకామ్రోగించజేశారు. దక్షిణాది నిర్మాతలకు; చిత్రాలకు హిందీ చిత్రరంగంలో సముచిత స్థానాన్ని కల్పించిన ఘనత వీరికే చెందుతుంది. వీరు రాజ్యసభసభ్యులు; పద్మభూషణ్ బిరుదాంకితులు.

శ్రీ వాసన్ మరణానికి సంతాపం తెలుపుతూ మద్రాసునగరంలోని స్టుడియోలు; థియేటర్లు ఆగస్టు 26 వ మూయబడ్డాయి.

శ్రీ వాసన్‌కు ఒకే కుమారుడు; ఒకే కుమార్తె వున్నారు. భార్య పేరు పట్టమ్మాళ్; కుమారుడిపేరు శ్రీ బాలసుబ్రహ్మణ్యం; కుమార్తెపేరు శ్రీమతి వనజ.

'చలనచిత్ర ధ్రువతార రాలిపోయింది' అన్నారు శ్రీ ఎం. జి. రామచంద్రన్.



"మెరుపువీరుడు" లో రాజనాల, విజయలలిత

# సినిమా

సుబ్బారావు ఆర్టును, శ్రీ వెంకటరత్నం కెమరాను, శ్రీ సత్యం స్టిల్సును నిర్వహిస్తారు. ఎడిటింగులో సిద్ధహస్తుడని పించుకున్న శ్రీ అక్కినేని సంజీవి దర్శకత్వంలో తయారుకానున్న ఈ చిత్రాన్ని శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తి నిర్మిస్తున్నారు. ఈ చిత్రం లక్ష్మీఫిలింస్ ద్వారా విడుదలౌతుంది.

*  *  *

రాయల ఫిలింస్ అధినేతల్లో ఒకరయిన శ్రీ నాగేశ్వరరావు పి. ఎస్. ఆర్. పిక్చర్స్‌వారి జానపదాన్ని, ఎ. ఎం. ప్రొడక్షన్స్‌వారి 'మా మంచి అక్కయ్య', చిత్రాలను విడుదలచేసే బాధ్యతలను స్వీకరించినట్లు తెలుస్తుంది. దిగ్విజయా ఫిలింస్‌వారి 'ప్రేమకానుక' చిత్రం కూడా రాయలఫిలింస్ ద్వారా విడుదలౌతుంది.

*  *  *

శ్రీ వి. ఎస్. గాంధి నిర్మించే 'వారధి' చిత్రంయొక్క షూటింగు ఆగస్టులో ప్రారంభం అవుతుందని మీకు తెలిపి వున్నాను. కానీ కొన్ని అనివార్య కారణాల వల్ల యీ చిత్రంయొక్క షూటింగు వాయిదాపడింది. శ్రీమతి ద్వివేదుల విశాలక్షి రచించిన 'వారధి' చిత్రానికి శ్రీ పినిశెట్టి మాటలను వ్రాస్తున్నారు.

ఈ చిత్రానికి శ్రీ సి. ఎస్. రావ్ దర్శకులు. నాయకీనాయకులుగా శ్రీమతి విజయనిర్మల, శ్రీ కృష్ణ నటిస్తున్నారు. మిగతా ముఖ్యపాత్రలను శ్రీమతి సావిత్రి, ప్రభాకరరెడ్డి, రాజబాబు, రమప్రభ, హేమలత, బేబి బ్రహ్మాజీ ధరిస్తారు. సంగీత దర్శకత్వాన్ని శ్రీ ఘంటసాల నిర్వహిస్తారు.

*  *  *

'గూఢచారి 116' చిత్రదర్శకుడయిన శ్రీ ఎం. మల్లికార్జునరావు నిర్మాత అయ్యారు; ఆయన స్థాపించిన సంస్థకు పద్మావతీ పిక్చర్స్ అనిపేరు; శ్రీ ఆరుద్ర రచన సాగించారు; ఈ చిత్రంకూడా 'సస్పెన్స్ క్రయింథ్రిల్లర్' గా వుండగలదని, ఆగస్టు 23 న యీచిత్రం తాలుకు మొదటిపాట రికార్డింగు జరుగగలదని శ్రీ మల్లికార్జునరావు వెల్లడించారు. ఈ చిత్రంలోని ముఖ్యపాత్రలను శ్రీయుతులు కృష్ణ, విజయనిర్మల, రాజబాబు పోషిస్తారు.

## మూడుభాషల చిత్రాలలో ఒకే కథానాయిక

బాక్సాఫీస్ చిత్రాలకు దర్శకత్వం నెరపిన శ్రీ వి. మధుసూదనరావు జెమినీవారి పాంఘికచిత్రాన్ని ప్రేక్షక జనరంజకంగా చిత్రీకరించారు. ఈచిత్రం మళయాళంలో బాక్సాఫీసు రికార్డులను బద్దలుచేసింది. తమిళంలోకూడా ఈవారం విడుదలై ప్రేక్షకుల అభిమానాన్ని పొందగలిగింది. తెలుగులో నిర్మాణం దాదాపు పూర్తయింది. ఈ మూడు భాషల్లోనూ శ్రీమతి శారద కథానాయికగా నటించింది; చక్కటి సెంటిమెంట్స్‌గల యీ కథను శ్రీ మధుసూదనరావు తెలుగు ప్రేక్షకులకి నచ్చేవిధంగా డైరెక్టుచేసినట్లు చెప్తున్నారు! ఈ చిత్రానికి శ్రీ బొల్లిముంత శివరామకృష్ణ మాటలను, శ్రీ ఎల్లప్ప కెమేరాను, శ్రీ శాంతారామ్ కళను, మహదేవన్ సంగీతాన్ని నిర్వహిస్తున్నారు. చిత్రంలోని ఇతర ప్రధాన పాత్రలను కాంచన, మంజుల, ఝాన్సీ, నిర్మల, శోభన్‌బాబు, హరనాథ్, గుమ్మడి, నాగభూషణం, చలం, కె. వి. చలం పోషించారు. ఈ చిత్రం నవయుగా ద్వారా విడుదలౌతుంది.

*  *

చిన్నిబ్రదర్స్ నిర్మిస్తున్న చిత్రానికి

## సినిమా డైరీ

- పి. ఎస్. ఆర్. పిక్చర్స్ షూటింగు వాహిని ఆరవ ఫ్లోర్‌లో జరిగింది. శ్రీ ఎన్. టి. రామారావు, రాజశ్రీలు పాడిన పాటయొక్క చిత్రీకరణ శ్రీ విఠలాచార్య దర్శకత్వంలో జరిగింది.
- భవానీ ఫిలింస్‌యొక్క షూటింగు ప్రసాద్ స్టుడియోలో జరిగింది. శ్రీ కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో శ్రీ ఎన్. టి. రామారావు, సరోజాదేవి పాల్గొన్నారు.
- సురేష్ మూవీస్ "సిపాయి చిన్నయ్య" అవుట‌డోర్ రెండు రోజులు జరిగింది. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు పాల్గొన్నారు.
- హైనా మూవీస్ చలన చిత్ర నిర్మాణ సంస్థ కార్యాలయ ప్రారంభోత్సవము శ్రీ నాగయ్య అధ్వర్యంలో ఆగష్టు 14 న జరిగింది.
- విజయా సురేష్ కంబైన్స్‌వారి "నమ్మకుళన్‌దైగళ్" తమిళ చిత్రంయొక్క షూటింగు ఆగస్టు 28 న వాహినీలో ప్రారంభమైంది. శ్రీ రామానాయుడు నిర్మిస్తున్న యీ చిత్రానికి శ్రీకాంత్ దర్శకుడు. శ్రీ సుందరరాజన్, బేబి రోజారమణి నటించిన సన్నివేశాల చిత్రీకరణ యీవారం జరిగింది.

'అమ్మ' అని పేరుపెట్టారు; ఈ చిత్ర కథను వ్రాసిన శ్రీ బి. వి. ప్రసాద్ ఈ చిత్రానికి దర్శకుడుకూడా; శ్రీ ఆత్రేయ మాటలను, శ్రీ ఎ. కె. శేఖర్ కళను, శ్రీ స్వామి కెమెరాను, శ్రీ ఆదినారాయణ రావు సంగీతాన్ని, శ్రీ ప్రకాశం ఎడిటింగును నిర్వహిస్తున్నారు. ముఖ్య పాత్రలను శ్రీయుతులు గుమ్మడి, నాగభూషణం, రాజబాబు, కృష్ణంరాజు, శ్రీమతి అంజలీదేవి పోషిస్తున్నారు. శ్రీమతి పుష్పవల్లి కుమార్తె కుమారి భానురేఖ ఈ చిత్రంలోని ఒక ప్రధానపాత్రను ధరిస్తూంది. లక్ష్మి ఫిలింస్ విడుదలచేసే ఈ చిత్రానికి శ్రీ ప్రత్యగాత్మ దర్శక పర్యవేక్షకుడు. వీరి తదుపరి చిత్రంలో శ్రీ నాగేశ్వరరావు కథానాయకుడు.

* * *

'అమ్మ'లో ఒక ముఖ్యపాత్రను ధరిస్తున్న కుమారి భానురేఖను ఒక ప్రఖ్యాత హిందీ నిర్మాత తను నిర్మించబోయే హిందిచిత్రంలో నాయిక వేషానికి నిర్ణయించినట్టు తెలుస్తూంది. తమిళంలో కూడా ఈమె నటిస్తున్న చిత్రాలు ఉన్నాయి.



'మాతృదేవత'లో చంద్రకళ, శోభన్‌బాబు

**అన్నదమ్ముల పాత్రలలో ఎన్. టి. రామారావు**

శ్రీ బి. ఎ. సుబ్బారావు దర్శకత్వం నిర్వహించిన తారకరామా వారి 'భలే తమ్ముడు' షూటింగు పూర్తయింది. శ్రీ పుండరీకాక్షయ్య నిర్మించిన ఈ చిత్రంలో శ్రీ రామారావు అన్నదమ్ములుగా నటించారు. శ్రీమతి కె. ఆర్. విజయ, కుమారి విజయ గిరిజ నాయికలుగా నటించిన ఈ చిత్రం విజయా పిక్చర్స్‌ద్వారా సెప్టెంబరులో విడుదలౌతుంది.

* * *

రెడ్డి అండ్ కో నిర్మిస్తున్న 'ధర్మపత్ని' చిత్రానికి శ్రీ ఆర్. కె. ధర్మరాజు వ్రాసిన కథను, శ్రీ జె. బి. కె. చౌదరి స్క్రీన్‌ప్లేను, శ్రీ పినిశెట్టి మాటలను వ్రాసారు. ప్రధాన పాత్రలను శ్రీయుతులు

# సినిమా

జగ్గయ్య, హరనాథ్, నాగభూషణం, రాజబాబు, అల్లు రామలింగయ్య, దేవిక, సూర్యకాంతం, రమాప్రభ, పండరీబాయి, సబిత పోషిస్తున్నారు. శ్రీ హరనాథ్‌కు జంటగా కుమారి మంజుల నటిస్తున్నది. శ్రీ రాజేశ్వరరావు సంగీతాన్ని, లక్ష్మణ్‌గోరే కెమెరాను, శ్రీ మారన్న కళను నిర్వహిస్తున్నారు. శ్రీయుతులు జయరామరెడ్డి, జె. వి. కె. చౌదరి నిర్మిస్తున్న యీ చిత్రాన్ని పూర్ణాపిక్చర్స్ విడుదల చేస్తారు.

* * *

'జగత్ కిలాడీలు' చిత్రం బహుళ ప్రజాదరణ పొందింది; యువ నిర్మాతలు శ్రీ కామేశ్వరరావు, రాఘవల పుత్సాహానికి తగ్గట్టుగా యీ చిత్రానికి మంచి కలెక్షన్స్ వస్తున్నాయి. వీరి రెండవ చిత్రం త్వరలోనే ప్రారంభమవౌతుంది; ఇందులో కూడా కృష్ణ కథానాయకుడు.

* * *

శ్రీ అబ్బి దర్శకత్వంలో మరో చక్కటి చిత్రాన్ని పద్మశ్రీ సంస్థ ప్రారంభించడానికి ప్రయత్నిస్తున్నారు ఈ చిత్రంలో కూడా హీరోగా కృష్ణ నటించగలరని తెలుస్తూంది.

* * *

తెలుగు తెరకు మరొక కొత్త రచయిత పరిచయం కాబోతున్నారు: ఆయన పేరు శ్రీ రమేష్. గ్రామీణవాసుల జీవిత విశేషాలకు సంబంధించిన ఈ కథకు శ్రీ కొండేపూడి లక్ష్మీనారాయణ మాటలు వ్రాస్తున్నారు ఈ చిత్రానికి శ్రీ ఆకుంచర్ల శేషగిరిరావు దర్శకుడు; ఈ సంస్థకు జనచిత్ర అని పేరు పెట్టారు; శ్రీ హరనాథ్ కథానాయకుడు; శ్రీ వేణు సంగీత నిర్దేశకుడు.

**తండ్రీ కొడుకులుగా**
**ముక్కామల, ప్రభాకరరెడ్డి**

టైగర్ ప్రొడక్షన్స్‌వారి 'అఖండుడు' చిత్రానికిగాను విజయాగార్డెన్స్‌లో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి విరచితంబయిన 'చంద్రశేఖరా' అనెడి పాట యిటీవల రికార్డు చెయ్యబడింది; శ్రీ చలపతిరావు సంగీత దర్శకత్వంలో శ్రీమతి జానకి పాడింది: శ్రీ వి. రామచంద్రరావు దర్శకత్వం నెరపనున్న ఈ చిత్రంలో శ్రీ ముక్కామల, శ్రీ ప్రభాకరరెడ్డి తండ్రీ కొడుకులుగా నటిస్తున్నారు. నాయికా నాయికులుగా భారతి, కృష్ణ అగుపిస్తారు.

**అక్కాచెల్లెళ్ల విభిన్నమనః**
**ప్రవృత్తులు**

ఎగ్జిబిషన్‌శాఖలో అపార అనుభవం గడించిన శ్రీ వి కృష్ణప్రసాద్ తెలుగు ప్రేక్షకులకు ఒక అపూర్వ చిత్రకథను సమర్పిస్తున్నారు. ప్రతివారు చూడదగ్గ సలక్షణమయిన కథ, ఆ కథలో కనపడే ప్రతిపాత్ర మీ సానుభూతిని పొందేలా రూపొందింప బడ్డాయి. ఈ చిత్రానికి 'అక్కాచెల్లెలు' అనిపేరు; కుటుంబంలో పెనవేసుకుపోయే ఆత్మబంధాలు; అక్కాచెల్లెళ్ల విభిన్న మానసిక ప్రవృత్తులు ముఖ్యాంశంగాగల యీ నీతిదాయకమయిన చిత్రంలో శ్రీ అక్కినేని నాగేశ్వరరావు సరికొత్త తరహాభూమికను ధరిస్తున్నారు. అక్కగా శ్రీమతి జానకి, చెల్లెలిగా శ్రీమతి విజయనిర్మల నటిస్తున్నారు. ఈ చిత్రం తమిళంలో బహుళ ప్రజాదరణ పొందింది; తెలుగు చిత్రంయొక్క షూటింగు ప్రతినెలా మొదటివారంలో హైద్రాబాదు సారధిస్టుడియోలో జరుగుతూవుంది; ఈ చిత్రానికి మాటలను శ్రీ ఆచార్య ఆత్రేయ, పాటలను శ్రీ ఆరుద్ర, శ్రీ ఆత్రేయ సంగీతాన్ని శ్రీ మహదేవన్, ఛాయాగ్రహణాన్ని శ్రీ వెంకటరత్నం, ఆర్టును శ్రీ జి. వి.



'ఉక్కుపిడుగు'లో రాజశ్రీ



ప్రవీణా పిక్చర్స్ వారి ప్రథమ చిత్రంలో విజయనిర్మల

సుబ్బారావు, నృత్యాన్ని శ్రీ చిన్ని సంపత్, మేకప్‌ను శ్రీ చౌదరి, స్టిల్స్‌ను శ్రీ సత్యం నిర్వహిస్తున్నారు.

'ఇల్లాలు' 'అత్తగారు కొత్తకోడలు' చిత్రాలకు దర్శకత్వంవహించి, పత్రికల ప్రశంసల నందుకున్న శ్రీ ఎ. సంజీవి యీ చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు. లక్ష్మి ఫిలింస్ విడుదలచేసే యీచిత్రంలోని ప్రధాన పాత్రలను శ్రీయుతులు కృష్ణ, పద్మనాభం, గుమ్మడి, నాగయ్య, అల్లు రామలింగయ్య, శాంతకుమారి, విజయలలిత, రమాప్రభ పోషిస్తున్నారు. ఇప్పటికి రెండు షెడ్యూల్సు పూర్తయినట్లు, శ్రీ నాగేశ్వరరావు కుమారి విజయలలిత లపై రెండు పాటల చిత్రీకరణ జరిగినట్లు తెలుస్తుంది.

* * *



"మా మంచి అక్కయ్య"లో కె. ఆర్. విజయ, శోభన్‌బాబు

జగపతి బ్యానర్‌కు ప్రజలలోగల ప్రత్యేక గౌరవం 'అక్కా చెల్లెలు' చిత్రంలో మరింత యెక్కువై తీరుతుంది. జగపతి ఫిలింస్ - నిర్మిస్తున్న యీ తొలిచిత్రం ప్రేక్షకులకు నచ్చే చక్కటి చిత్రంగా వుండగలదని ఆశించవచ్చు.

* * *

శ్రీ హరనాథ్‌కు పర్సనాలిటీ వుంది. మాడ్యులేటివ్ కంఠంవుంది; నటనలో బ్యాలన్స్‌వుంది; వాచికంలో నేర్పువుంది; ఇతడు నాయకుడిగా నటించిన చిత్రాలన్నీ నిర్మాతలకు డబ్బులు తెచ్చిపెట్టాయి; హరనాథ్ ఏ పాత్ర నయినా చక్కగా పోషించగలడు అనే పేరు వుంది.

ప్రస్తుతం హరనాథ్ రాత్రింబవళ్లు షూటింగు కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు. దాదాపు డజను చిత్రాలలో కథానాయక పాత్రను ధరిస్తున్నారు.

—శ్రీనివాస్

సభ్యులు పెద్ద వూరేగింపు జరిపారు: కాంగ్రెసు వర్కింగ్ కమిటీని బెదిరిస్తూ ఉపన్యాసాలు మొదలుపెట్టారు.

చవాన్‌గారు రాయబారాలు నడుపుదామని చూశారు. ఆయన ఒక ఒడంబడికని తయారుచేసి దానిని మరో మహారాష్ట్ర సోదరుడు యస్కె. పాటిల్‌గారికి చూపించారు.

వర్కింగ్ కమిటి మీటింగులో బాబూ జగ్‌జీవన్‌రాంని, ఆయన భాగస్వామి ఫక్రుద్దీన్ ఆలీ అహ్మద్‌గారిని సంజాయిషీ చెప్పుకోమన్నారు. చవాన్‌గారు తెచ్చిన రిజల్యూషన్‌ని యస్కె. పాటిల్‌గారు సమర్థించారు. అందులో ఎలాంటి చిన్న మార్పులకీ మేడమ్ గాంధీ అంగీకరించలేదు. కాంగ్రెసు ప్రెసిడెంటు, కామరాజాగారు, మొరార్జీ దేశాయిగారు ఏకాంతవాసం చేయాల్సి వచ్చింది. మేడమ్ గాంధీ విజయాన్ని సాధించారు.

అపరశివాజీ పేరులో చవాన్‌గారు ఢిల్లీలో అడుగుపెట్టారు. ఢిల్లీలోని ఆయన యింటినిండా శివాజీ పటాలున్నాయనుకోండి. అదీ ఒక యోగ్యతే! ఆయన దగ్గర వీరశివాజీ కత్తికూడా ఒకటుందని ప్రతీతి! శివాజీ గురించిన ఒకకథ వుంది. ఔరంగజేబు సేనాని అఫ్జల్‌ఖాన్ ఆయన్ని

# న్యూఢిల్లీ లేఖ

(3-వ పేజీ తరువాయి)

కావలించుకు వెన్నుపోటు పొడవాలని ప్రయత్నించాడు. మన ఆధునిక శివాజీగారు కాంగ్రెసు ప్రెసిడెంటునీ కామరాజుగారినీ మొరార్జీ దేశాయిగారినీ — అఫ్జల్ ఖాన్‌ని అసలు శివాజీ ఎలా పొడిచాడో అలా దెబ్బతీశారు. ఈ తేడాతో మన శివాజీగారు రెంటికీ చెడ్డ రేవడ్డైనారు. బెంగుళూరులో తనని ఎదిరించినందుకు చవాన్‌గారిని పబ్లిక్‌గా తిట్టారు మేడమ్‌గాంధీ. ఇప్పుడు ఆయన్ని నమ్ముకున్న ముగ్గుర్నీ గంగలో దింపారు.

వర్కింగ్ కమిటీ వడంబడిక కాంగ్రెసును రక్షించింది.

మేడమ్‌గాంధీ—ఆమెగారి అనుచరులూ 1972 తర్వాతకూడా భద్రంగా వుంటారని తెలిసిపోయింది. ఈ వుపకథ చాలమంది నిజస్వరూపాల్ని బయటపెట్టింది. చాలమంది గౌరవప్రతిష్ఠల్నీ మాయం చేసింది. ఎవరు ఏమనుకున్నా శ్రీమతి గాంధీ మాత్రం అన్ని వొడిదుడుకుల్నుంచీ బయటపడ్డానని అనుకుంటున్నారు.

మేడమ్‌గాంధీ సంజీవరెడ్డిగార్ని ఆదిలో సమర్థించడం ద్వారా ఆమెకి అపాంతరాలు ఏర్పడ్డాయి. తర్వాత సమర్థించడానికి వెనకాడినప్పటినుంచి ఆమె చతురత ఎలావున్నా, వ్యక్తిగతంగా చాలా అపహాస్యం పాలయ్యారనే చెప్పాలి. తనపనిని ఎన్నిరకాలుగా సమర్థించుకోవాలని చూసినా ఆమెపై ఎవరికీ నమ్మకం కుదరదు. పార్టీ సభ్యుని ఓటమి దేశంలోనేకాదు. విదేశాల్లోకూడా మేడమ్ గాంధీమీద సదభిప్రాయాన్ని తొలగిస్తుంది. ఇప్పటివరకు మనదేశంలో ప్రధానమంత్రి సంతకానికి కొంతబలం వుండేది. ఈసారితో దాని విలువ పూర్తిగా పోయినట్టే లెక్క.

మేడమ్ గాంధీ తాను కోరుకున్నది సాధించుకుని వుండొచ్చు. కాని అది ఒక విధంగా పెద్దనష్టం కూడాను. ఆమెకి మద్దతు యిచ్చినందుకు కమ్యూనిస్టుల్ని అభినందించి తీరాలి. యస్సెస్ బెనర్జీగారి సంతోషంకోసమా అన్నట్టు క్రిందటి సంవత్సరం కేంద్ర ఉద్యోగుల కేసులు ఇప్పుడు పునరుద్ధరించబడ్డాయి! పశ్చిమ బెంగాల్‌లో తమ కమ్యూనిస్టు సోదరుల్ని ఎదిరించిన పోలీసువారిమీద బెనర్జీగారు సానుభూతి చూపకపోవడం విచారించదగ్గ విషయం!

బాబు జగ్‌జీవన్‌రాంగారు ఉపప్రధాని అవుతారనీ, ఫక్రుద్దీన్‌ఆలీ అహ్మద్‌గారు, లేక సి....సుబ్రహ్మణ్యంగారో ఆర్థిక మంత్రి అవుతారనీ ఒక ప్రచారముంది. క్రిష్ణమీనన్‌గారు కూడా మంత్రి పదవిని స్వీకరించవచ్చు. రెడ్డిగార్ని సమర్థించినందుకు కొందరు పెద్దలు తొలగిపోనూవచ్చు. ఎవరో సలహాయిచ్చారు, కాంగ్రెసు ప్రెసిడెంటుగారు రెడ్డిగార్ని బలపర్చినవారినందరిపైన క్రమశిక్షణ చర్యలు తీసుకోవాలిట! ●




## రంగులరాట్నం

(20-వ పేజీ తరువాయి)

వినిపించని ఉన్నతస్థాయి స్వరంలో, వదులుతుంది. ఇవి ముందుగా ప్రయాణించిఆటంకాలు ఏవేనాఉంటే వాటికి తట్టుకొని వెనుదిరిగి వస్తాయి. ఈ తరంగాలను గబ్బిలం గ్రహించి ఎక్కడ ఆటంకం ఉందో తెలుసుకొంటుంది!

—జమ్మి కోనేటిరావు.

**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**

